# లంకా దహనము

(అను)

# శ్రీ హనుమద్విజయము

(ఐదు అంకముల నాటకము)





గ్రంథకర్త:

మతుకుమల్లి నరసింహశాస్త్రి





Price Rs. 1—8—0

1947

శ్రీరస్తు.

శ్రీ నృసింహ సహాయము.

లంకాదహనము

అను

# శ్రీ హనుమద్విజయము

మాతుకుమల్లి నరసింహశాస్త్రి

ప్రణీతము.



విద్వాన్, శతావధాని:

భమిడిపాటి అయ్యప్పశాస్త్రిగారిచే

సరిచూడఁబడినది.

బెజవాడ-శంకరఘాండ్రీవారిచే

ప్రకటితము.

 1947. [వెల రు 1—8—0

# నా మనవి

నేను చిన్నదానను. పదిరెండు వత్సరములదాననై యుండగా ఈ గ్రంథ కర్తయగు నా తండ్రి నరసింహశాస్త్రి గారు గన్నవరములో రెవెన్యూ యినస్పెక్టరుద్యోగమునందుండి పరమపదించినారు ఆయన రచియించిన యీ హనుమద్విజయ నాటకమును మా మేనత్త యిందుమతీదేవి చినిగిన అక్షరములు దిద్ది వ్రాసి ప్రోత్సహించినది. నేను నాటనుండి చిన్నదానను. శరీరబాధలు సంసార బాధలచే దీనిని అచ్చొత్తించుటకు సందర్భపడక యూరకున్నందుకు విచారపడుచున్నాను. ఈ పౌత్రమును ముద్రింపించుటకు మా శ్రమమేమియును లేదు. మా తండ్రిగారు ఆర్జించి పెట్టినదిన్ని ఆయన తండ్రిగారార్జించినట్టిదిన్ని యగు ధనమే కలదు. గాని కాలము నతిక్రమించుటకు మానవుడు స్వతంత్రుడు కాడుగదా! నేటికి ఈ గ్రంథము బయలుపడు సమయమేతెంచినది. ఇప్పటికైనను దీనిని ముద్రింపించగలిగినందుకు సంతసించుచు మా తండ్రికి నే నింకేమియును చేయజాలనందుకు విచారించుచు పరమపదవాసి మా తండ్రికి నమస్కరించుచు ఆయన ఆత్మకు సంతృప్తికలుగుగాత మని కోరుచు ఆయనవలన ఆశీస్సులందగోరుచున్నాను.

ఇట్లు,

లక్కరాజు కమలా రంగనాయకమ్మ.

---

# పుష్పాంజలి

ఆర్యమహాశయులారా!

ఏతద్గ్రంథకర్తయగు సుధీమణి కాశ్యపాన్వయ సంజాతుడును, కాండద్వయంబునం దారితేరి తర్క వ్యాకరణాద్యనేక శాస్త్రపారంగతుండగు నృసింహ విద్వన్మణి పౌత్త్రుండును మన్నాతులుండు నగుచున్నవాడు. పితృమాతృ సేవా పరాయణుండు. కులక్రమాగతంబగు కవితా కన్యను పొందగలిగిన ధీరుడు.

"నా ఋషిః క్రియతే కావ్యం" బనునట్లు నృసింహ దైవాంశ సంభూతుండై, తన్నామకుండై, మధుర వాగ్గేయంబులతో నలరారు నాటకంబునకు నుపక్రమించి యున్నాడు.

"శ్రేయాంసి బహువిఘ్నాని" యనునట్లు ముద్రితగ్రంథం బందుకొనకయే ధాతికతను వీడిన మహాశయుడు. చిత్రము. అర్థశతాబ్దియైన మనగడలేదు. "సుకృతీ నశాయుః" యథార్థము

"ఆ పరితోషా ద్విదుషాం నసాధు మన్యే" కాళిదాసోక్తిననుసరించి విజ్ఞులరగు మీరు గ్రంథరాజం బందుకొందురుగాత.

ఈ గ్రంథమిప్పటి కైనను ముద్రణాలయంబు నధిష్ఠించుట ముదావహము. నా మాతామహవంశము పేరెన్నిక గన్నదగుటచే ఉప్పొంగుచుంటిని. వారివలననే చిన్నవారికి గౌరవము. దీనికి తార్కాణముగా వర్తమానంబునందు దిగంత విశ్రాంత కీర్తి నార్జించి ఆంధ్రావనియందు తన వాక్సుధచే సారస్వతమ్మన్యుల తృప్తి నొందించిన ధీమణి నా పినతల్లి ఇందుమతీ దేవిగారు. వీరి పూర్వీకులు చతుష్షష్టి కళాకోవిదులగుచు తెనాలి పట్టణంబున పిల్లలమర్రివారను వైశ్య శిరోరత్నములతో సమానముగా సభాగ్రతాంబూలంబు లందుకొనుచుండెడివారు. అట్టివారిని గురించి దౌహిత్రుండ నగు నేను వ్రాయబూనుట సాహసమే. అయినను నాకు తోచిన నుడువులను నుడివితిని. ఈ గ్రంథము నచ్చొత్తించి ప్రకాశింపజేయు మస్మాతుల సంబంధీకులగు లక్ష్మీనృసింహాఖ్యుడు చిరకాలాయురారోగ్య ఐశ్వర్యంబులతో నలరారు నట్లు చేయుగాత.

ఇట్లు,

పౌరాణిక రత్న,

పర్వతం రాధాకృష్ణశర్మ, విజయవాడ.

---

# కవి వంశము

ఈ గ్రంథకర్తయగు మతుకుమల్లి నరసింహశాస్త్రిగారి వంశమును గూర్చి యించుక బల్కనెంచితి.

గ్రంథకర్తయే వ్రాసికొనినాడు గాని నాకు తోచినంత తెలిసినంత నేనును జెప్పెద.

ఈగ్రంథకర్తకు ఏడవపురుషుతగు వెంగళశాస్త్రిగారు సంతతిలేక మాలికొండ నరసింహదేవు నుపాసించి నల్వురు పుత్రులంబడసె.

ఈ వెంగళార్యుని పూర్వులందరు చినపమిణి పెదపమిణి జమీందారులకడ మంత్రిపదవులయం దుండువారు. చతుష్షష్టి కళాకోవిదులని ప్రఖ్యాతి గిగిన వారు.

వీరికి మతుకుమల్లియను గ్రామము నివాసము. వీరు మతుకుమల్లి రాజగోపాలుని భక్తులైయుండిరి. వీరికి మతుకుమల్లియు, ఆల్వాలపాడు, వెలిచెర్ల, నేరేడుబల్లి, పెదపలిదెము, మండూరు, భరితెపూడియు నను ఏడుమిరాసీ గ్రామములు గలవు

ఈ వెంగళశాస్త్రిగారి పుత్రుల హయాములోనే తెనాలియందు ప్రవేశించిరని తలంపవచ్చును.

వెంగళశాస్త్రి పుత్రులు వెంకట నరసింహము, లక్ష్మీనరసింహము, కనకామాత్యుడు, మాధవశాస్త్రి యను నలువురు.

ఈ మాధవశాస్త్రియే అభినవభారత గ్రంథము రచియించినవాడు. ఈయనను "అభినవ మాధవశాస్త్రి" యని యందురు.

ఈయన తన భారతమునందు తన తండ్రియగు వెంగళామాత్యునిం గూర్చి యిట్లు వ్రాసినాడు.

సీ. ఎవ్వాని దాతృత్వ మెల్ల లోకంబుల నెఱిని కర్ణాదుల మఱపు గఱపు
నెవ్వాని గంభీర మేరువారాసుల కొజ్జలై విజ్జల నొజ్జగించు
నెవ్వాని సంపద లింద్రాది దిక్పాల వరుల భాగ్యములను బరిహసించు
నెవ్వాని ధైర్యంబు హేమకూటోన్నతి దిలకించి పలుమారు దెగడుచుండు
గీ. నతడు మంత్రి చూడాగంధవరం డనఘ మంత్రి నిభుడు సజ్జన మాన్యుండు నీతిపరుడు
సల్లలిత లింగమాసాధ్వి వల్లభుండు మహిత తేజుండు వెంగళామాత్యఘనుడు

మఱియు నీయన తన జ్యేష్ఠసోదరుడగు వేంకటనరసింహ మంత్రింగూర్చి యీ క్రింది రీతిని చెప్పియున్నాడు.

సీ॥ ప్రాగ్రిత నిగ్రహానుగ్రహశక్తులు గలవాడు వైష్ణిక కర్మఠలన
నవయంబు ఘటనా ఘటన పాటవంబులు గలవాడు జ్యోతిష కళలయందు
పృథుతర దుర్మాంత్రి ఖేదనైకప్రౌఢి గలవాడు సద్యశోగరిమ వలన
దశదిశాతిః మహత్తర కీర్తి విస్ఫూర్తి గలవాడు నెఱిని త్యాగంబువలన
గీ॥ నతడె పో మామకాగ్రజుం డఖిలవేది చారు విభవుండు వేంకట నారసింహ
మంత్రివర్యుండు దేవతా మంత్రిసముడు పార్వతీసాధ్వి కలరెడు ప్రాణవిభుడు.

అని చెప్పినాడు. ఈ మాధవకవి కవిత్వము తేనెసోనల తియ్యం దనముప్పారు చుండు. తేట తెలుగు మాటలతోడను, మధుర రసాల ఫలరస మాధురీ గరిమ విలసిల్లు సంస్కృత పదరాజిచే విరాజిల్లు చుండును.

ఇక నీ మాధవశాస్త్రిగారి భార్య మంచాల వాసుదేవశాస్త్రిగారి కుమార్తె. పేరు అలమేల్మంగ నాంచారమ్మ. నాంచారమ్మ అని యందురు.

ఈ నాంచారమ్మ చక్కగా కవిత్వముం జెప్పునది. ఈమె తండ్రి మంచాల వాసుదేవశాస్త్రియు మధురకవిత్వము నల్లువాడేనట. గాని కవికృత గ్రంథములు లభింపలేదు.

వీరింటిలో సంస్కృతమునే వాడుకగా మాటాడువారట. మాధవశాస్త్రిగారు నిరంతర విద్యా వ్యాసంగముచేతను, శిష్యపాళికి కావ్యములు వేదపాఠములు నేర్పుటచేతను, గ్రంథరచనారతుం డగుటచేతను, తాను వెళ్లుటకు తీరికలేక జనక గృహంబున నున్న భార్యను తోడితెచ్చుటకై పెద్దవాడును పురోహితుడు నగు రామావధాని యను విప్రోత్తమునిం బంపెనట.

ఆనాడు రెండెడ్ల బండ్లప్రయాణములే గదా! అవధానియు నాంచారమ్మను దోడ్కొని వచ్చుచుండ నామె తన తండ్రిగారి తుమ్మలోపు కడకు వచ్చినప్పుడు అవధానిగారిం గని ఆర్య! భవన్నగరంబున నింధనంబులు సమృద్ధమా? యనెనట. అందు కాయన మారువబలుకక శంకాకులిత మానసముతో నింటికిం జేరిన పిమ్మట మాధవకవీంద్రునితో 'మీ భార్య నన్ను అనరానిమాట అనిన'దని చెప్పెనట. మాధవ

శాస్త్రి భార్యను బిలిచి యడుగగా నామె నిక్కము వక్కాణింపగా నా యవధాని కయ్యర్థంబు వివరించి మనంబు కలంక వాపి, సమ్మానించి యంపెనట. ఒకప్పుడు ఏకాంతమునందుంట నాంచారమ్మ భర్తతో నీ క్రిందివిధమున బలికినదట.

గీ. వసుధలోపల మంచాలవారియిల్లు శారదాదేవి నాటకశాలయందు
వాసుదేవుని కవితా విలాస మచట మొలక బంగారు గజ్జల మ్రోత గాదె?

అని యామె యిట్లు పద్యముం జెప్పగా రసికాగ్రణి యగు మాధవశాస్త్రి నవ్వుచు నిట్లు చెప్పెనట.

గీ. అతిచమత్కృతి గలిగిన మతుకుమల్లి వారు శబ్దంబు గొలిపిన కారణమున
వసుధలోపల మంచాలవారియిల్లు శారదాదేవి నాటకశాలయందు.

వాసుదేవుని కవితావిలాసమచట మొలకబంగారు గజ్జల మ్రోత గాదె! అని చెప్పెను

ఈ మాధవశాస్త్రి తన వంశము చాపష్టికళానిధాన మను బిరుదు గలది యగుటకు తార్కాణముగా తెనాలిలో మతుకుమల్లివారి వీధియందుగల గోవర్ధన స్వామివారి యాలయమునకెదుట రాతితో గరుడస్తంభమును స్వహస్తములతో చెక్కి నిర్మించి స్థాపించినాడు. ఇప్పటికిని గలదు. వీరిచే చెక్కబడిన కొయ్యదర్వాజా చాలా కాలము వీరివంశీయుల యింట వసుగ్వబడియుండెను. ఈయన కుమారుని పెండ్లికి కోడలికి గావలసిన స్వర్ణ రజతాభరణములు స్వహస్తములతోనే నిర్మించిరి. వీరు విలువిద్యా నిపుణులని ప్రతీతి. ఇంకను వీరికళా కౌశలములంగూర్చి పెద్దలు చెప్పుచుందురు. వీరికడ విల్లు, నమ్ములు నుండునవి.

ఈ మతుకుమల్లివారును పిల్లలమఱ్ఱివారును తెనాలిలో సభాగ్ర తాంబూలాది సత్కార పూజలనందుచు ఏకోదర న్యాయంబున వర్తించువారు

ఆనాడు శాఖా భేదములు లేక యైకమత్యంబున వర్తించుచుండిరి.

వీరి కుమారుడు చిన నరసింహశాస్త్రి. ఈయనయే పెద్ద కుమారుడు. తమ్ముల పేరులు తెలియవు.

నరసింహశాస్త్రి భార్య అనంతలక్ష్మమ్మ. పదలపాకవారి యాడుబడుచు. పొన్నూరు పుట్టినిల్లు.

ఈమె నిరతాన్నదాత. 'డొక్కల కరవ'ని ప్రసిద్ధిజెందిన నందన సంవత్సరపు కాటకమప్పుడు క్షుధాతురులకు అంబలి, అన్నము, మజ్జిగ, గుమ్మడిపండ్ల గుజ్జు ఇచ్చి ప్రాణములు రక్షించినది. ఈమె పుణ్యసాధ్వీమణి. ఈ నరసింహశాస్త్రికి 'శబ్దశాస్త్రత్రయీ విచక్షణుడ'ను బిరుదము గలదు.

వీరికి కనకాద్రిశాస్త్రియు, మంగళాద్రిశాస్త్రియు, మాధవశాస్త్రియు నను ముగ్గురు పుత్రులు గలరు. అందు ద్వితీయుడగు మాధవశాస్త్రి బందరు కాలేజీలో పండితుడుగ నుండిరి. వీరు దశావతారస్తోత్ర మను రెండువందల పద్యములుగల గ్రంథమొకటి రచియించిరి. రెండవది మాలికాచల రమణ శతకము. ఇది లభింపలేదు.

వీరిలో నగ్రజుడగు కనకాద్రిశాస్త్రి గారు సకల శాస్త్రపారంగతులు. వీరు వాసిరెడ్డి వెంకటాద్రినాయని యాస్థాన పండితులతో రజితపాత్రలయందు భుజింప కూడదని వాదించి నానావాదనిధాన మను గ్రంథము శ్రుతి స్మృతి ప్రమాణ సహితముగా రచియించి విజయమందిరి.

వీరు రేపల్లె ప్రభువులగు జంగన్నారావు గారి యాస్థానమందు సన్మానింపబడుచుండిరి. సత్తెనపల్లి జమీందారులగు మానూరు గోపాలనాయనం గారు "తమ యాస్థానమునకు ఈ కనకాద్రి శాస్త్రిగారిని పంపుడని కోరగా" స్వతంత్రుడు ఆయన, నాదేమిలేదని ప్రభువు చెప్పగా; లక్షరూప్యములొసంగెదను. మీరెట్లయినను వారిని మాకొసంగుడని కోరగా "శాస్త్రిగారి విలువ లక్షగాదు కోటి లక్షలుకూడ చాలవని" జంగన్నారావు జవాబుచెప్పిరట. తర్వాత సత్తెనపల్లి ప్రభువు, శాస్త్రిగారిని, ప్రార్థనాపూర్వకముగ నడిగిరి, శాస్త్రి గారు గోపాలనాయనిం గారి యాస్థానమలంకరించిరి.

సత్తెనపల్లిలో నుండగా ఈ కనకాద్రిశాస్త్రి యొక సర్పదష్టుడగు పురుషుని "గరుడ దండక"మను దండకమును, అప్పు డాశువుగా రచియించి చదివి, యాతనికా యాశీవిషబాధ నివారణచేసి బ్రదికించిరి.

ఈ కనకాద్రి శాస్త్రిగారు తమ పాండిత్య ప్రకర్షవలన ననేక ప్రభువుల వలన సన్మాన బహుమాన రూపముల ననేక గ్రామములయందు మాన్యములు సంపాదించిరి. అవి యీ దిగువ చెప్పిన చిలకలూరిపేట, ప్రత్తిపాడు, అంగలకుదురు, కొలకలూరు, కఠెవరము, తెనాలి, పల్లాయిపాలెము చినరావూరు, ఇనగల్లు, ఇనగదప, తిరువూరు, గంపలగూడెము, మొదలగు గ్రామములు. గాని యిటీవల వీరిసంతతివారు ఈ చివర నుదహరించిన గ్రామములయందు మాన్యములను అచటికి వెళ్లుట మానివేసి వదలివేసిరి

ఈయన తన స్వార్జితమగు ఆస్తిని తన దాయాదులకు సమముగా పంచిపెట్టుటయే గాక తన బంధువులలో పేదకుటుంబములు పదునారు కుటుంబములు ఇంటిలో నుంచికొని పోషించి బంధుపోషకుడని పేరందినాడు. నిరతాన్నదాత.

తెనాలిలో 'చక్కల అంబి' అను నామె భాగవతము ఆటగట్టి తెరపైకిరాగా నే ప్రత్యర్థులు మంత్రము ముగను చేయ, రక్త వమనములతో పడిపోయెనట. అప్పుడు ఈ కనకాద్రిశాస్త్రిగారు "(బాలే హిమవత్పర్వత బాలే) అనుచు, చూర్ణికం జదివి కుంకుమబొట్టు పెట్టగా నామె లేచి సుఖముగా నుండెనట. (ఈ చూర్ణిక దొరుక లేదు) గరుడ దండకము వీరి మునిమనుమడగు మరుకుమల్లి నరసింహారావుచే రచియింపబడిన "భక్తినామమహిమ" యను గ్రంథములో ముద్రింపించబడినది.

ఈశాస్త్రిగారి తాతగారగు మాధవశాస్త్రి గారు రచియించిన అభినవ భారత గ్రంథము వీరి దాయాదు లెత్తుకునిపోగా వారియిండ్లు అగ్నిదగ్ధమైనప్పుడు ఈ గ్రంథముకూడా దగ్ధమైనది. ఆసమయమున కనకాద్రిశాస్త్రి గారి రెండవ కుమారుడగు కృష్ణశాస్త్రి గారు అచ్చటనుండుట తటస్థించినది. ఆయన సాహసించి లోనికి జని సంది

టీ పట్టినంత గ్రంథములాగికొనివచ్చి బైటబడవేసి మరలలోనికిం బోవుచుండ నలువంకల మంటలు చెలరేగగా తోడివారు వలదని నివారించిరి. దైవానుగ్రహము వలన దొరికినంతవఱకు గ్రంథము మొదటినుంచి భీష్మపర్వము వఱకును సరిగా దొరికినది. దానిని మతుకుమల్లి రఘూత్తమశాస్త్రిగారు ముద్రింపించిరి. ఈ మతుకుమల్లి వారు తెనాలి ప్రవేశించినది వీ గణాచార్యుని కాలముననో తండ్రిగారగు కొండమంత్రి లేక తాతగారగు కృష్ణమంత్రి కాలముననో వచ్చియుందురు. అట్లైన నీనాటికి దాదాపు (400) నాలుగువందల సంవత్సరములైన లేక మూడువందల యేబది సంవత్సరములకు పైనపై యుండవచ్చును.

కనకాద్రిశాస్త్రిగారి భార్య జానకమ్మగారు, పొన్నూరు చదలవాక సుబ్బయ్యగారి కుమార్తె. ఈమెయు పరమసాధ్వి. చక్కని గానకవిత్వముం జెప్పుచుండునది. ఘనవర్గమూలములను గణితమునంతయు కుమారులకును, మనుమలకును ఈమెయే నేర్పినదట.

ఒకనాడు ప్రత్యర్థి పండితులెవరో వచ్చి శాస్త్రిగారితో తర్కమునకై వచ్చితి మనియు శాస్త్రిగారింటనుండిరా? యని యడిగిరట. అందుకు ఆమె పెదశాస్త్రిగారు కావలెనా? చినశాస్త్రిగారు కావలెనా? అని యడిగెనట. ఎవరైనాసరియే ననిరట. అప్పుడు వారి కామె యిట్లు ప్రత్యుత్తరంబిడెనట.

ఆ. మతుకుమల్లి యిల్లు మహి విద్య వెదచల్లు, పరబుధేంద్రులకును బ్రక్కమల్లు
ఎఱిగి మెలగిరేని యెలమిచే బాటిల్లు, గాన వారియిల్లు ఘనతజెందు. అనిపల్కెనట.

ఈ జానకమ్మగారియందు కనకాద్రిశాస్త్రిగారు ముగ్గురు పుత్రులంగనిరి. అందు ఈ గ్రంథకర్తగారి పితామహుడగు బుచ్చినరసింహశాస్త్రిగారు జ్యేష్ఠ కుమారుడు. కృష్ణశాస్త్రి రెండవకుమారుడు. రామచంద్రశాస్త్రి మూడవ కుమారుడు. ఇందు జ్యేష్ఠుడగు నరసింహశాస్త్రిగారు తర్కశాస్త్ర పండితుడు. విలువిద్యానిపుణుడు. సంగీత సాహిత్య భరతశాస్త్ర పారంగతుడు. కృష్ణాతీరమగు తోట్లవల్లూరునందు బొమ్మదేవర నాగన్న నాయనింగారి యాస్థాన కవీంద్రుడై సభాభూషణమై యలరినాడు. ఈ కవితల్లజుడు బహు గ్రంథములు రచియించినాడు.

అందు అజచరిత్రము ఆరు ఆశ్వాసముల గ్రంథము. మాల్యశైల నృసింహుని కంకితము. అందు రెండు పద్యములు వ్రాయుదును.

ఈ గ్రంథమునకు "ఇందుమతీ పరిణయ" మను పర్యాయనామమును గలదు. ఇందుమతీ దేవి నాసావర్ణన పద్యమును వ్రాయుదును.

మ. సతినాసామిష పద్మరాగరుచిరోద్యస్ఫీతకోణోపలా
మృత వాపీ రస మూర్ఛనానన కన న్మీనాంక కేళీవనాం
చిత పుంద్రాతత పత్ర వల్లుల కమర్చెంబో ఘటీయంత్ర మా
చతురాస్యుం డన నొందదగ్రమణి భూషారత్న సంభస్థితిన్.

చంద్ర దూషణము.

సీ. క్షణిక ప్రపాత తీక్ష్ణతర ప్రకాశంబె కాని చిరస్థాయి యౌనె! యుగ్రం
యజ్ఞాత దుస్సహ వ్యథ పాతాన్మోహకంబే కాని దాహదంబే! మహాహి
స్వావేశజాను భావానుమేయమె కాని యఖిల దృగ్గోచరంబా! గ్రహంబు
మలిన పరేత ప్రమాదియే కాని జీవ ద్విప్రయోగి తాపనుడె! యనుడు
గీ. సతి మహోశని పత్యహి పతిమహాగ్రహుండ పతిఘర్మదవు నీవరూ! శశాంక!
యెన్న నీకదియే యుక్కడే యహీన త యదియే ప్రభూతతయదే దండిచెలువు.

వింధ్యారణ్యవర్ణనము.

చ. అట ద్రోవంజని కాంచెఁ గట్టెదుట గూటాటీక నాటోపవి
త్రుటితాజాండ కటాహ కోటరగళ ద్దుర్వార పాథోరుఘ్ని
పటలాజస్ర పరిప్లుతి ప్రతిదిన ప్రత్యగ్ర పత్రచ్ఛటా
ఘ్యట ఖేటోత్కట కాటవీ స్ఫుట దవంధ్యాగంబు వింధ్యాగముల్.

ఇందుమతి చెలికత్తెలందరు, చిలుకను పట్టబోవు సందర్భమున పద్యము-

సీ. మానుమున్న చనఁ బోంట్ల గని కిన్క నిరియు కెంబెదవు లాస కిడు బింబికలుగాఁగ
వంగ వంగఁగ మల్లు వడుకు చాధోలంబ తరళహారముల వాగురులుగాఁగ
దాదాపి నడచు తందరజారి జీరాడు వలిపె పయ్యెదలు వెన్వలులుగాఁగ
చల్ల చల్లఁగఁ బరస్పరము మర్మ మెలర్ప బలుకు పల్కులు దీములనుగాఁగ
గీ. బారిసి ప్రవిసారితాన్యోన్య భుజలతాభి కీలితాన్యోన్యతాదృగ్భుజాలతలయి
పొదివికొని చుట్టికొని మూగి పొంచి పొంచి యల్లనల్లన గదిసి శేతాంశముఖులు.

గీ. ఇట్టు లనుబట్టు సమకట్టు నిందుముఖుల గుభగుభిల్లని నగవు కన్గొనల దొలఁక
గలికి గమితోడ రాచిల్క కలకలార్తి కలిత కలకాకు కాకలీ కలన బలికె.

ఉ. ఓసుకుమార! కామ ముకురోపమ చారుకపోల పాలులా
రా! సరసీరుహాసన వరాంగికి బోడిని మీద కామరూ
పాసమ కామ చార రతి నామర జాతిని గాన నింకనా
యాసము మాను డేటికి ముధాళ నను న్మరి బట్టకళ్యనే!

ఇందులోని వసంతబుతు వర్ణన మిట్లున్నది.

సీ. లీలావనీజాల బాలావనీజాల వాలావనీలోల జాలకంబు
వరసాలశుకిసాల భరసాల సభసాల సురసాల ముఖసాల సురభిళంబు
కేళికా రసికతా బాలికా కృతలతా డోలికా తను పతాకాళికంబు
ఫుల్లకా పర భూమ మల్లికా ద్యభిరామ వల్లికా సుమనో మతల్లికంబు
గీ. సలయ నర్తిత కువలయోత్పల సరోజ నిలయ వన వనకిసలయ కలయములయ
పవన విలయిత కువలయ యాచరతి కరి మోద్యమం బొప్పె నంత చైత్రోద్యమంబు.

తిరుపతి వెంకటకవుల్? (ఈ నృసింహశాస్త్రిగారిం గూర్చి ఈ క్రింది విధముగా జలికినపద్యముగలదు.)

సీ. క్షమ విహరించు వాక్సతి పుట్టినయిల్లు మతుకుమల్లి కులమతల్లిక తదన్వ
యాదికుఁ డేంగళార్యాదులు మాన్యకీర్తుల నృసింహ కరుణోపలబ్ధ వరచ
తుష్షష్టి విద్యావిదులు భవత్ప్రపితామహుండు మాధవ కవీంద్రోత్తముఁ డభి
నవభారతాది నానా గ్రంథకర్త నీతాత నృసింహ విద్వద్వరుండు.
గీ. శబ్దశాస్త్ర తర్కయో విచక్షణుఁడు నీదు జనకుఁడైనట్టి కవ రాఘవ శాస్త్రివర్యుఁ
డఖిలశాస్త్రార్థ వేది నీ వద్భుత ప్రసిద్ధ సారస్వతుఁడవు నృసింహశాస్త్రి!

వీరిం గూర్చి యింతైన వ్రాయం దగినది యుండెం గాని గ్రంథవిస్తరభీతి మాన్పించినది.

ఈ నరసింహశాస్త్రిగారు ఎడ్లపల్లి కాపురస్థులగు తురగా నరసయ్యగారి కుమార్తెయగు రంగనాయకమ్మను వివాహమైరి.

ఈమె మువ్వురు కుమారులను మువ్వురు కుమార్తెలను గాంచిరి.

ఇందు పెద్ద కుమారుడు: మతుకుమల్లి రఘూత్తమ శాస్త్రిగారు. సంస్కృత పండితుఁడు. తెలుగు ప్లీడరు,

ద్వితీయ పుత్త్రుఁడు: నరహర్యక్షరాయ శాస్త్రిగారు. ఈ గ్రంథకర్త తండ్రి. తెలుఁగు పండితుఁడుగా గుంటూరులో కొన్నాళ్లుండిరి.

మూఁడవ కుమారుఁడు: సరస్వతీ వరప్రసాదరాయ శాస్త్రి, గుంటూరు కాలేజీలో సంస్కృత పండితుఁడుగా నుండిరి.

రఘూత్తమశాస్త్రి కుమారుడు కోటయ్యశాస్త్రి, వెంగళశాస్త్రియని యందురు. ఈయన సమస్తవిద్యలు నేర్చి సంస్కృతమున శిరోమణిపరీక్షయందు ఉత్తీర్ణుఁడైనాడు. ఇంగ్లండు వెళ్ళి సమస్త పరీక్షలం గెలిచినాఁడు, కీర్తిశేషుఁడైనాడు.

సరస్వతీశాస్త్రిగారికి నృసింహశాస్త్రియను నొక కుమారుడుగలడు. ఇతనికి మువ్వురు మగబిడ్డలు. నరహర్యక్షరాయశాస్త్రిగారు స్త్రీవిద్యాభిమాని. నరసింహ భక్తుఁడు. భార్య పంతమ్మగారు, అనంతలక్ష్మమ్మ యను నామాంతరముగల సాధ్వి. ఈమెను ఎల్లరు అజాతశత్రువి యందురు.

ఈమె యెన్నఁడును మఱచియైనను వొంత కష్టము గలిగించినను, పెట్టి విరోధులయొద్దనైనను ద్వేషముగాని గాని, పరుషముగా భాషించిగాని, ఎరుగదు. సత్కర్మాచరణానురక్త. సదా, సద్వ్రతాసక్త. భగవద్ధ్యానానురక్త. పతివ్రతాశిరోముక్తామణి యని పేరందిన సాధు దైవత. అక్కరాజు వెంకటరత్నముగారికిని, కోటంరాజువారి యాఁడుపడుచును పరమసుశీలా శిరోమణియు నగు అప్పమ్మయను నామెకును జ్యేష్ఠపుత్త్రికయై జన్మించెను.

ఈమె పితామహులు అక్కరాజు హనుమయ్యగారు సంగయ్యగారను వారలు రేపల్లె ప్రభువులకడ మంత్రిపదవులయందుండి కీర్తి వడసినవారలు. ఈ నరహర్యక్షరాయ శాస్త్రిగారు ఈ అనంతలక్ష్మమ్మగారియందు అయిదుగురు కుమార్తెలను కుమారునొక్కనిం గాంచెను.



గ్రంథకర్త.

మతుకుమల్లి నరసింహశాస్త్రి.





గ్రంథకర్త భార్యయు, కుమార్తెయు,

జానకిరామమ్మ, చి. కమలారంగనాయకమ్మ.



గ్రంథకర్త సోదరి:

గుడిపూడి ఇందుమతీదేవి.

ఈ హనుమద్విజయ గ్రంథకర్తయగు ఈ నరసింహశాస్త్రిగారి కుమారుడు. ఈయన బి. ఏ. ప్యాసయినవెనుక తండ్రిగారు ప్లీడరు చదువ వలసినదిగా సెలవిచ్చిరి. ఆయనకు ఇష్టములేనందున మానివేసిరి. రెవిన్యూ యినస్పెక్టరుద్యోగములోనుండి నలుబదియైదవయేట స్వర్గస్థుడాయెను.

ఈయన పరమపవిత్ర శీలుడును, సత్యవాదియును, ధర్మతత్పరుడును, శ్రీరామ పాద భక్తశిరోమణి యగు తన మేనమామగారగు లక్కరాజు వెంకటపంతామాత్యుని కుమార్తె కమలాంబయను నామెను వివాహమయ్యెను. ఆమె పుత్త్రినింగని పుత్త్రినితో దివికేగె. మరల పరాశర గోత్రజులును, భద్రాచల నివాసులును నగు తూము వెంకటరత్నము పంతులుగారను సాధుపురుషుని రెండవకుమార్తెయగు జానకీరామమ్మను వివాహమయిరి. ఆమెయందు కమలారంగనాయకమ్మ యను నొక్క కుమార్తెను గాంచిరి. శాంతస్వభావము, బంధుప్రేమగలదియు నగు ఈమెను "లక్కరాజు గంగేశ్వరరావుగారికిని, ఇందిరాదేవికిని తృతీయపుత్త్రుడును, బుద్ధిమంతుడును విద్యావంతుడును" నగు త్రివిక్రమరావను నామముచే నలంకృతుడగు మేనల్లునకిచ్చి వివాహముం జేసిరి. ఈమె యిప్పుడు పుత్త్రపుత్త్రీ సమేతయై భర్తతో తెనాలిలో సుఖముగా కాపురము చేయుచున్నది. ఇంతకును ఈ గ్రంథకర్తగారగు మతుకుమల్లి నరసింహశాస్త్రిగారు నాకు మేనమామ. ఈయన యేకైకపుత్త్రికను భర్తృపుత్త్రపుత్త్రీ సమేతముగా దీర్ఘాయురారోగ్యసంపదలిచ్చి రక్షించవలెనని పరమేశ్వరుని ప్రార్థించుచు స్వర్గస్థులగు మా మేనమామగారికి వందనము లర్పించుచున్నాను.

ఈ గ్రంథము చిత్తువ్రాసి యున్నది. శుద్ధప్రతి అక్షరములు ఛిద్రమై పోవుచుండెను. మా మేనమామగారు స్వర్గస్థులయ్యెను నిరువది రెండేడులాయె. ముద్రింపించుటకు అసందర్భములచే వీలు కాలేదు. అట్టి యీ పొత్తమును ఈ గ్రంథకర్తకు కనిష్ఠ సోదరియును కవయిత్రీమణియు నగు మా పినతల్లిగారైన గుడిపూడి ఇందుమతీదేవి, శుద్ధప్రతి వ్రాసి సోదరాభిమానముచేతను విద్యాభిమానముచేతను ఈ గ్రంథము ముద్రణమున కిచ్చుటకు రేబవలును ఏమియును తోచక సోదరునిం దలంచుకొని విలపించుచుండునది. నేటికి ఈ గ్రంథము బయలు వెడలు శుభోదయవేళ వచ్చినందు కెంతయు మోదమందుచున్నారము.

మా మేనమామగారు ఇందుమతీదేవిం గాంచి కనిష్ఠయనియును విద్యావతియనియును చక్కని సాహిత్యపటిమగలది యనియును నెంతో సంతసించుచు నిట్లు పలుకుచుండువాడు.

"గీ. ఇందుబింబ మందు నెవ్వేళ నీ ప్రాపు చల్లనౌ సుధారసంబు వెలుగు
నిందుమతల్లి! నీదు సుందరకైతలో నీవు తిమ్మాడైన వెంతమేలో!" అనుచుండువాడు.

ఇందుమతీదేవి, పుట్టినింటికి వెళ్ళినప్పుడు అన్నగారున్న ప్రతి యూరికిని వెళ్ళునది. అక్కడ స్త్రీలు నిరంతరము నీమె గ్రంథకాలక్షేపము చేయుచుండ వినగోరి గుమిగూడి వచ్చుచుండురు. అప్పుడు ఆనందముతో నిట్లనుచుండువాడు.

మా యిందుతల్లి వీరందరికిని ఏమిబంగారమిచ్చునో ఈమె యుండినస్థానము ప్రతిదినము వీరందరునూ వచ్చుచుందురు. ఈమె వెళ్లిన మరునాడు ఒక్కరైనను మా ముఖము చూడ రనుచుండువాడు. ఇందుమతీదేవిగారి లక్షణాపరిణయ గ్రంథము లోని పద్యము లీయన కెంతయో యిష్టముగ నుండును. అందు రెండు పద్యము లెప్పుడు మెచ్చుకొనువాడు. అవి రెండును ఈ క్రింద వ్రాయుదును.

సీ. తరుణిపై బూసిన హరిచందనంబెన్న పాలుపొంద కస్తూరి పూతయయ్యె
వనిత ధరించిన వజ్రాలహారముల్ హరినీలమణిమయ సరములయ్యె
చెలియ కొప్పుననున్న సేమంతి రేకులు తలప నిందీవర దళములయ్యె
ముగుద ముక్కున నున్న ముక్తాఫలామంబు చోద్యమొప్పగ గుల్ల గున్నమయ్యె.

గీ. పల్లవాధరశయ్యకు బఱచినట్టి పల్లవంబులు తృటిలోన భస్మమయ్యె
సఖులు చేసెడు శైత్యోపచారములును అబలకును వేండ్రమయ్యె గదయ్య! కృష్ణ!

సీ. నీ మెచ్చునట్లు నా నేర్చిన చిత్రముల్ వ్రాసిచూపింతునా! భానురాంగి!
స్థాణువుల్ చిగురింప చట్రాలు గరుగంగ వీణ వాయింతునా? విద్రుమోష్ఠి!
గురిజూచి శరమేసి గురుతరవిలువిద్య జూపి మెప్పింతునా! సుందరాంగి!
సారథ్యమందలి చతురతచే తేరు నడిపి మెప్పింతునా? నలినగంధి!

గీ. వివిధ తరుపుష్పమాలికా విరచనా కుశలతజూపుదునో! లేక చతురనవర
స భరితామేయ కవితా రచన దలిర్ప పద్యములు వ్రాయుమందునో! పద్మనయన!

గీ. ధీసమేతవు నీవన్ని తెలుగుపనుల యందు స్వారస్య మెఱిగిన యట్టిదాన
వన్నియును చేయనేర్తు నీ వగవిదేని నాచరింతునో? దాని నా కానతిమ్ము.

గ్రంథము చాలా పెరిగినది. మాతామహాలంకారీయనముచే విద్యాభిమానముచే గురుభక్తిచే మహానందోత్సాహములచే విస్తరించి వ్రాసితి. పాఠకులు క్షమింతురుగాక.

శ్రీ మాల్య శైల
లక్ష్మీనృసింహ దేవతాభ్యో నమః

పౌరాణిక రత్న:
పర్వతము రాధాకృష్ణమూర్తి పాకయాజి.

ఓమ్.

శ్రీమత్పరదేవతాయై నమః

# పండితాభిప్రాయములు

చ. మధుర కవీశ్వరుల్ మతుకుమల్లి గృహంబునఁ బుట్టుచుండ్రి. పె
న్నిధి కవితాకుమారి రచినిన్ విలసిల్లు నృసింహశాస్త్రి సా
ధ్వధిపుఁ డుదారశీలములు న్యాయ్యవిధిన్ వికసింపఁజేసె. వా
రున్నత గొని భావముల్ తెలసి శ్రోత్రలు పారకు లుల్లసిల్లుతన్

మహాలక్ష్మి శ్రీ శ్రీమతి మధుర కవయిత్రీ శిరోమణి గుడిపూడి యిందుమతీ దేవి సోదరీమణిగారికి, నాయందుఁగల యాదరాభిమానములవలన, శ్రీ మతుకుమల్లి వారి కవిత్వములు చూచు భాగ్యము కలిగి మిక్కిలి సంతసించుచున్నాను.

ఇందుమతీదేవిగారు నిగర్వచూడామణి యగుటవల్ల వారికి మహామహులొసంగిన బిరుదములుకూడఁ బ్రకటించుకొనకుండిరి అనేక సభలలో వారికిఁ జాలమంది మంచి మంచి బిరుదంబులొసంగియున్నవారు. వారికి మహామహులు ప్రేమతో నొసంగిన, శ్రీ "కవయిత్రీశిరోమణి" బిరుదము వారి పేరునకు మున్ముందు వికసించుచుండునుగాతయని హృదయపూర్వకముగా మేము గోరుచున్నాము. నేను శ్రీ హనుమద్విజయ నాటకమును జూచి మిక్కిలి యానందము నొందితిని. శ్రీ నరసింహశాస్త్రిగారు తాతగారగు నరసింహశాస్త్రిగారి శక్తిసంతతియుఁ బుణికి పుచ్చుకొనుట వల్లనే యా మెఱుగులు వీరి కవిత్వమునం దలరారుచున్నయవి. వారియిందుమతిని నేను జూచినాను. వసుచరిత్ర దానితరువాత నుండదగినదియని యనుకొన్నాను ఈ హనుమద్విజయమునందు విషయములు చదివినకొలది ఇంకను జదువవలయుననునభిప్రాయమే కలుగుచుండును. తనివిదీరదు. నేను ఈ విషయము ఈ నాటకమును జదువునపుడు నాకు గలిగిన యనుభవమును బ్రకటించుకొనుచున్నాను. నన్నయకు మెఱుగు పెట్టిన తిక్కనకరణి తాతగారికి వన్నె దెచ్చిన విషయము లిందలరారుచున్నయవి. శ్రీ కమలారంగనాయకమ్మ భాగ్యమే భాగ్యము, అట్టి మహామహుని పుత్రీరత్నమై యా కవీశ్వరుని గ్రంథములు సద్భక్తితో నింత కాలముకడచినను ముద్రింపించుటకుఁ బూనుకొనుట మిక్కిలి ప్రశంసనీయము, శ్రీ లక్ష్మీనరసింహస్వామి, శ్రీ కవయిత్రీ శిరోమణి గుడిపూడి యిందుమతీదేవిగారిని, శ్రీ కమలారంగనాయకమ్మగారిని, వారి వారిని, వారి కుటుంబములను నెల్లరను సర్వదా సకల శుభములొసంగుచు సంరక్షించుచుండును గాత.

విద్వాన్ శతావధాని

భమిడిపాటి అయ్యప్పశాస్త్రి

18—10—1947

శ్రీమత్పరదేవతాయై నమః

# శ్రీ హ ను మ ద్వి జ య ము

అను నీ తెలుగు నాటకము కీ. శే. మతుకుమల్లి నృసింహశాస్త్రిగారు రచియించిరి. ఈయన, బందరు జిల్లాలో రివిన్యూ యినస్పెక్టరుద్యోగం బొనర్చెను. ఈయన తన అలంకారదాన నాటకమునందు నాంది ప్రస్తావనయందు తిరుపతి వేంకటేశ్వర కవులకడ కొంత పాండిత్య మభ్యసించినట్లు చెప్పియుండిరి. వారు పెద్దల యెడ భక్తి భావము గలవారగుటచే వారియందు గౌరవముచే నట్లు చెప్పియుండిరి. సహజముగా కవితాధోరణి వారి వంశమునకే గలదు. కొన్ని వందల వత్సరముల నుండియును వీరి పూర్వులు పండితులు కవులునై యుండిరి. వీరి పితామహుడు మతుకుమల్లి నరసింహశాస్త్రిగారు తర్కశాస్త్ర పండితుడు. కవీంద్రుడు. ఇందుమతీ పరిణయాద్యనేక గ్రంథకర్త. ఈ నరసింహశాస్త్రిగారికి సుప్రసిద్ధ పండితులును సంఘ సంస్కర్తలు నగు శ్రీ నందిరాజు లక్ష్మీనారాయణ దీక్షితుల వారితో పెద్ద విద్యా వివాదము సాగినది.

మతుకుమిల్లివారు తిరుమణి తిరుచూర్ణధారులు. దీక్షితులవారు తద్ధారణమును పూర్తిగా ద్వేషించువారు. వ్రాసినచో గ్రంథము పెరుగును. కాని కొంత తద్ద్వారా విశిష్టాద్వైత శిష్యత్వమునకు పాల్పడవలసి వచ్చునని యే మతుకుమల్లివారికిని నందిరాజు వారికిని నడచిన పూర్వపక్ష సిద్ధాంతములు గ్రంథరూపమున నున్నవి. తుదకు మతుకుమల్లివారే జయించిరి. గాని దీక్షితులవారి కోరికను గౌరవింపక, తమ పితృపితామహులతోపాటు తిరుమణి తిరుచూర్ణధారులుగ నుండిరి. ఆనాటి ఆ విజేతగారగు, నరసింహశాస్త్రిగారి పౌత్రుడే ప్రస్తుత నాటకకర్త. గాన

గీ. సారకవితాభిరామ ......
వేరె యీ కృతిగోనములు వేయునేల'

అను తిక్కన సోమయాజిగారి ఈ పద్యార్థము నొకసారి పరిష్కృతము జ్ఞప్తికిం దెచ్చుకొని తరువాయికి దిగుదుముగాక.

సీ. మతుకుమల్లి కులంబు మహనీయతకు సాక్షి యెందరో విద్వాంసు లిల గలారు
విద్వాంసులే గాదు విద్వత్కవులు గూడ బలువురు గలరు సుప్రథిత యశులు
విద్వత్కవులె గాదు విదుషీమణులు కవయిత్రులుగూడ నం దెసక మెసగు
ముందురు వారిలో నుత్కృష్ట కవయిత్రి యిందుమతీదేవి కృతులు చాల
గీ. బుధులు మెచ్చగ రచియించి పుట్టినిల్లు మెట్టినిల్లును శోభిల్ల నట్టి ప్రతిభ
శిక్కరై యలరారెడి నీ మెవంటి సాధ్వులలుందుగ నుందు నిస్సంశయంబు.

ఆ. వె. మాటలాడ నేర్పు మధురంబుగా సభ్యు లలరి మెచ్చికొనెడి యట్టి ఫక్కి
నిందుమతికి సాటి యిందుమతీదేవి యెదువులు నుతింప నలవుఁ జేరము,

ఆ. వె॥ ఆత్రివారియింటి యాఖ్యయందలి గుడి పుట్టినింటి మల్లి పూవుతావి
రెండు నెసగ మెసగ నిందు కీర్తిని గుడిపూడి రామరావు పొలతి వెలయు.

ఈ యింకుమతీదేవి యీ గ్రంథకర్త యగు నరసింహ శాస్త్రికి తోబుట్టువు. ఈమె తన అన్నగారు రచియించిన యీ నాటకమును ముద్రణమునకు తెచ్చిన పుణ్యాత్మురాలు. ఈమె రచియించిన లక్షణాపరిణయము అంబరీష విజయము మొదలగు ప్రబంధములును నర్మదా పురుకుత్సీయ నాటకమును ఇంక నితర గ్రంథములను చదివిన వారికి శ్రీమతి కవితా ప్రావీణ్యము గోచరించును. మతుకుమల్లి వంశము కవితా వంశమే గాక విద్వద్వంశము కూడను. ఈ యంశము ఈ దృశ్య ప్రబంధము నెచ్చట దీసి చదివినను తెల్లము కాగలదు. తిః బోధము గచులెందుకు? ఆ యీ మతుకుమల్లి వంశజుడగు మాధవశాస్త్రియే అభినవ భారత గ్రంథమును రచియించి అభినవ మాధవశాస్త్రియను బిరుదు వహించినారు. ఆ గ్రంథమును తెనాలిలో ప్రకృత నాటక గ్రంథకర్తయగు నరసింహశాస్త్రిగారి పెదతండ్రి గారగు రఘూత్తమశాస్త్రిగారి యొద్ద తాళపత్రములలో సుమారు 80 ముప్పది వత్సరముల నాడు చదువు గక్షగ సంతోషముగా జూచియున్నాను. వీరి నాటకము సర్వథా రమణీయము. ఇది నా సంగ్రహీతమగు నాయాశయము. స్వస్తి.

బెజవాడ
క్షీరసాగరము
1-11-1947

ఇట్లు
చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి.
శతావధాని

# చిన్న మనవి

అయ్యలారా! హనుమద్విజయము, రామదాసు, జయంతజయపాలము ననుదు నాటకములు నా సోదరుడు రచియించియుండెను. రామదాసు నామావశిష్టమైనది.

ఈ గ్రంథకర్తయగు నా సోదరుడు చనిపోయి యిరువది యేడులు కడచనియె. నేటికి శిథిలమైన జయంత జయపాల హనుమద్విజయములు నాకు లభించినవి. హనుమద్విజయమును అచ్చటచ్చట శిథిలమైన అక్షరములు మాత్రము సరిచేసి వ్రాసితిని. నావ్రాతలో పొరపాటు లుండియుండును. గుణగ్రహణపారీణులు మన్నింతురుగాక.

ఈ గ్రంథకర్తయొక్క యేకైక పుత్త్రియు పుత్త్రీపుత్త్ర సంతానవతియు నగు కమలారంగనాయకమ్మను, చిరాయు రారోగ్య సౌభాగ్య భాగ్యము లొసంగి పరమేశ్వరుడు రక్షించుగాతమని కోరుచు నా సోదరుని ఆత్మకు శాంతి గలిగించుమని ప్రార్థించుచున్నాను.

సీ. నలువది నాలుగేండ్ల ప్రాయమునకె నీ కాయుష్యమది సరిపోయె నన్న
జనకు డార్జించిన సంపద నుంతయు ననుభవించకపోయె నీ కగితన్న
తల్లిదండ్రులు ధన్యతనొంట నీకంటె ముందు స్వర్గస్థితి నందిరన్న
కన్నకూతురి వేడుకలు చేసికొన జూడ నక్కటా నోచికోవైతి వన్న

కల్లయు మోసంబు కపట మమాయయు పరధనాపేక్ష నీ కెఱుంగవన్న
తెలియు "యథార్థవాదియె బాంధవవిరోధి" యనుట నీ కడ సత్య మాయెనన్న
తగ "కృష్ణుడల సుభద్రను బోలె" ననుగాంచి మించుకూరిమి గారవించి తన్ను
యెన్న నందరికన్న చిన్నదాననటంచు ఘనదయామతి నన్ను గంటివన్న
తన ప్రాణమని నిన్ను గను జ్యేష్ఠసోదరి యల రమాదేవి యెంతడలెనన్న
నీమాటగా నెంచి నీ కూతు కమలను గని మది సంతృప్తి గంటిమన్న
పాటలు పద్యముల్ పాడెడు నేరుపు తియ్యందనము నేర్పితివిగదన్న
మన పితామహులబోలి ఘనకావ్యములు వ్రాసితని సంతసమున నన్నంటి వన్న

గీ. చదువగలవంచు కైత చెప్పెదవటంచు పాడగలవంచు చక్కగా పలుకుదనుచు
నుల్ల మలరగ మా యిందుకల్లి! యంచు పిలుతు వన్న నిన్నే వేళ దలతునన్న
ఎడద నీకిదె యొక నమస్కారమన్న!

అన్నా! వాల్మీకి భావము ననుసరించి మధురభావములతో శ్రీరామ పాదాబ్జములపై భక్తితో, ఈ హనుమద్విజయ నాటకమును నీవు రచియించితివి. నేను నీవు స్వర్గస్థుడవైనదాది నేటికలకును మనశ్శాంతి నొందజాలనైతి గాని ఆ కొరతలో మాత్రము మన స్సిమితము లేక ఆంధ్రవాల్మీకి రామాయణపఠన మొనర్చుచు కాలము గడిపితిని గాని, అందులో భరతుడు బ్రదికియున్న రాముని గూర్చి, అన్నా! యని దుఃఖించిన ఘట్టము జదివినకొలది 'చనిపోయిన' నా అన్నవు నిన్ను గూర్చి నాకు ఆవేదన మెక్కుడై, గుండియలు బరువెక్కి బాధ మిక్కుటమగుచుండెను.

అంతట నా ఘట్టము వదిలివేసి సుందరాకాండము జదివి యెట్లో మనసు కుదుట బరచికొంటిని. నీవును దానికనుగుణ్యముగా

ఉ. క్షీరము నందు చక్కెరను జేరిచినట్లు నీదు వాక్సుధా
పూరము నందు రఘువుని పుణ్యచరిత్రము మేళవించి యా
భూరి గుణాబ్ధి మారుతి సుప్రవృత్తి బలోన్నతి సుందరంబుగా
సూరులు మెచ్చ బల్కితివి సుందరి ధాత్రి సుతా మహత్త్వమున్

ఇంతే చాలు. ఈ హనుమద్విజయ నాటకము ముద్రితమగుటయే నాకు పదివేలు.

బెజవాడ.
11—11—1947.

మృదు మధుర కవయిత్రీ శిరోమణి:
గుడిపూడి ఇందుమతీదేవి.

---

ఈ హనుమద్విజయమను నీ దృశ్యకావ్యము అభిప్రాయమునకై నాకు పంపబడినది.

ప్రథమ పత్రమునందలి శంకావళి గుండవలి ప్రథమపద్యమును జూచుటతోడనే యీ గ్రంథరచయిత యెవరో యందు నను సంశయము నివృత్తి యగుటయేగాక, నా కమందానందముకూడ జనించెను. ఏలయన? వీరి ప్రపితామహులు ప్రపితామహుడగు, వెంగళార్యుని నాటనుండియును, మఱుకుచల్లివారి వంశము పంక్తిక కవివంశము సూత్ర

సిద్ధము యుండెననుటకు మాధవశాస్త్రిగారు రచియించిన 'అభినవభారతము'ను వీరి పితామహ ప్రణీతమగు ఇందుమతీ పరిణయాద్యనేక గ్రంథములును, ప్రబల నిదర్శనములు. అంతియేకాక ప్రస్తుత కవిగారి కనిష్ఠసోదరియును, సుప్రసిద్ధాంధ్ర కవయిత్రియు లక్ష్మణాపరిణయాద్యనేక గ్రంథకర్త్రియు నగు గుడిపూడి ఇందుమతీ దేవిగారి కవితా మాధుర్యమును జవిచూచినను, వీరి వంశము పండిత కవివంశ మనుట నిర్వివాదాంశము. ఇట్టి సద్వంశజులగు ఈ ప్రకృతకవిచే నీ గ్రంథము రచియింపబడుటచే సంతసము జనించుటయే గాక ఈ గ్రంథకర్తయగు సుతుకుమల్లి నరసింహశాస్త్రి గారు మా స్వగ్రామమగు పొన్నలూరునందు రవిన్యూ యిన్స్పెక్టరుగా నుండుటచే పరిచితులగుటయే గాక, మిత్రులగుటయు, వీరితండ్రిగారగు నరహర్యక్షరాయశాస్త్రులు గారు నిరంతరము ప్రీతితో నాతోడ విద్యాగోష్ఠి నొనర్చుచుండువారగుటచేతను ఈ గ్రంథమునందు పండితాభిప్రాయము నొసంగుట కటుసించినందుకును, చిరకాలమునకు, వీరివాక్కును వినుట తటస్థించినందుకును ఆనందము నందితిని.

ఈ గ్రంథకర్త యొరులకు భయపడువాడు కాడు. ఒరుల భయపెట్టి వశము జేసి కొనవలె నను నుద్దేశ్యము గలవాడును గాడు.

నిష్కాపట్యము, సత్యము, భూతదయ, యీ కవికి సహజగుణములు. నాకు విదితము. ఇది అతిశయోక్తిగాదు.

"శ్లో. య ఉత్తమ శ్లోక గుణానువాదా త్పుమా న్విరజ్యేత వినా పశుఘ్నాత్"

అనగా పశుఘ్నుడు దక్క భగవత్కథయందు విముఖుడెవ్వడుండును? అను భాగవత వచనమును బరిశీలించినను

శ్లో. రామస్మరణా దన్యోపాయం నహి పశ్యామో భవతరణే,

అనగా సంసారమును తరించుటకు రామకథాగానము కంటె మఱియొక యుపాయము లేదు అనియెడి యాభియుక్తవచనమును విచారించినను, సర్వజనాదరణీయమై, ఐహికాముష్మిక ఫలప్రదము నగు రామకథచే నలరారుచున్న యీ గ్రంథము పాఠకలోకమున కాదరణీయమై యుండు ననుట నిస్సంశయము. మరియు నీ కవి యీ గ్రంథమున నీ క్రింది రీతిం జెప్పినాడు.

గీ. రామ విభుకథయందు ననురక్తి మెండు, అందు మరుదాత్మజుని పాటి యౌదు రెవరు?
మహిమగడు భక్తిమై హనుమద్విజయము, నాటకంబుగ రచియించి నాడ నేడు.

అని చెప్పెను.

ఈ కవికి కవిసోదరికిం గూడ రామభక్తి మెండని తోచుచున్నది. వీరి యిష్ట దైవము మాల్యాద్రి నృసింహుడైనను ఇష్టదేవతా ప్రార్థనమునందు ముందు రాముని తరువాతి హనుమంతునిం, బిమ్మట నరసింహుని స్తుతించి యీ కవి గ్రంథమారంభించి నాడు.

మఱియు వీరి కవిత్వము సులభశైలిలో నొప్పుచు కదళీపాకముగా నుండుటచే పామరులకును నిరుపమమయినందున బండితులకును గూడ ఆదరణీయమై యున్నది యని చెప్పనగును. ఇందలి పద్యములు చక్కని భావములతో నింపుగా

నున్నవి. అతిశయోక్తి గాదు. కీర్తిశేషులగు ప్రకృత కవిగారికి తన గ్రంథమును ముద్రింపించి ప్రకటించు భాగ్యము సంభవింపని లోపమును వారి యొక్క పుత్రికయగు కమలారంగనాయకమ్మగారును ఈ కవిగారి కనిష్ఠ సహోదరియగు గుడిపూడి ఇందుమతీదేవిగారును శ్రద్ధతో ఈ పుస్తకమును ప్రకటింపజేసి తీర్చినందుకు సంతోషము నందితిని. కవిగారి పుత్రికయు శ్రీ చిరంజీవి సౌభాగ్యవతియగు లక్ష్మీరాజు కమలారంగనాయకమ్మగారికిని, భర్తృ పుత్ర పుత్రికాయుష్యలకును, ప్రకృత కవిగారి సోదరియు సోదరప్రేమాభిమానపూరితమానసయును ఈ గ్రంథ ముద్రణమునకు ప్రేక్షకురాలును నగు శ్రీమతి సౌభాగ్యవతి ఇందుమతీదేవిగారికిని వారి కుటుంబమునకును, ప్రకృత గ్రంథ కథానాయకుడగు శ్రీరామచంద్రమూర్తి సకలాయురారోగ్యైశ్వర్య విద్యాభివృద్ధులనొసంగి రక్షించుగాత యనియు ఈ హనుమద్విజయ నాటక గ్రంథకర్తయగు కీర్తిశేషులగు శ్రీ మతుకుమల్లి నరసింహశాస్త్రిగారికి సంపూర్ణాత్మశాంతిని గలుగజేయుగాత మనియు శ్రీరాముని ప్రార్థించుచు విరమించుచుంటిని.

బెజవాడ,<br>గాంధీ నగరము.<br>1—11—47

ఇట్లు,<br>లక్కావఝుల వెంకటకృష్ణశాస్త్రి,<br>ఆశ్చర్యరామాయణాది గ్రంథకర్త.

---

లంకాదహన మను నీ అయిదంకముల నాటకమును అభిప్రాయమునకై నాకడకు బంపబడినది. మిక్కిలి భక్తిపూరితముగాను పండిత పామర హృదయ రంజకముగా తేటతెల్ల మగునట్లు వెలయుచున్నది.

కవిభావము మిక్కిలి భక్త్యావేశములతో గూడియుంట రామచంద్రమూర్తియు సీతయు హనుమానుడును ఎదుట గన్పట్టుచుండగా నీ గ్రంథము వ్రాసెనా? యని యీ కవిత్వసరణింజూడ దోచుచుంటయేగాక కనుల నీరు గ్రమ్మును సీతారాముల కష్టపాటును విచారముంజూడ కరుణా దుఃఖ రసావేశమును హనుమానుని వీర విక్రమంబుంజూడ సముద్రేక పూరితమగుచు వీరావేశముతో నొడల గగుర్పాటును చదువరులకు గలుగక తప్పదు.

ఇక కవిత్వశైలి కదళీపాకము. పూర్వకవుల ధోరణికిం దీసిపోదు.

గ్రంథకర్త గవర్నమెంటుద్యోగము చేయుచునుండి మనంబున భక్తి రసావేశమైనప్పు డెల్ల వ్రాసెనని తలంతును.

పద్యము లన్నియు మృదుమధురముగ నున్నవి. పాత్రపోషణము చక్కగ నున్నది. వీరి వంశమున కవిత్వము పుట్టి పెరిగినది. గాన నీ మతుకుమల్లి వారికి స్వతస్సిద్ధముగా కవిత్వ మలవాటుపడినది. తద్వంశీయుడగు నీ నరసింహశాస్త్రిగారికిట్టి సుకవిత్వము గలుగుటలో వింత లేదు. వీరింట స్త్రీలును చక్కని కవిత్వమల్లుదు రనుటకు కవి సోదరియగు గుడిపూడి ఇందుమతీదేవిగారు ప్రబలనిదర్శనము. ఆంధ్రలోకమంతయు నెఱుంగును.

ఈ గ్రంథకర్త నలువదిరెండేడుల వయసుననే స్వర్గస్థుడైనాడు. ఆయనచే రచియించిన నీ గ్రంథమును నింక చక్కగా నొనర్చును. ఈయన యింకను జయంతి జయపాలనమును రామదాసు నను రెండు నాటకములు గూడా వ్రాసియున్నాడు.

గ్రంథమును భక్తి ప్రేమలతో ముద్రించుచున్న వీరి యేకైకపుత్రి శ్రీ చి. సౌ భాగ్యవతియునగు లక్ష్మీరాజు కమలాంబనాయకమ్మకును, గ్రంథము నంతయును చక్కగా శుద్ధప్రతి వ్రాసి యెంతయు కష్టపడి ప్రకటించుటకు ప్రోత్సాహ మొనర్చిన కవిసోదరి సౌభాగ్యవతియగు గుడిపూడి ఇందుమతిదేవికిని గ్రంథకర్తగారి వంశమంతకు నిలువేల్పునాయడగు మాల్యాద్రి నృసింహుడు దీర్ఘాయురారోగ్య సౌభాగ్య సంతాన సమృద్ధి నిడి రక్షించుగాక.

ఈ నరసింహశాస్త్రి గారి దౌహిత్రులు గూడ నరసింహ శాస్త్రులరై సుప్రసిద్ధమగు పూర్వుల యశంబు నిలుపుదురు గాక.

ఈ గ్రంథకర్త గారి యాత్మకు శాంతి కలుగుగాత మని శ్రీరాముని ప్రార్థించుచు విరమించుచున్నాడ.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

మంగళమ్ మహత్

బెజవాడ
హనుమాన్ పేట
5—11—1947

వేలూరి వెంకట రామయ్య,

---

ఉ. శ్రీదరహాస వీక్షణ పరీక్ష కనఃక్షణ దీక్షుఁడౌ నృసిం
హాదరణాత్త సత్కవన శౌరి నృసింహకవి ప్రణీత "లం
కా దహనంబు" నా సుకవి గాదిలి సోదరి వల్కె నింటి, నా
మోదము గంటిఁ బండితుల పుణ్యము లెన్నఁగఁ గంటి నొంటిగన్.

చ. అమృత రసాస్వదంబు నగు నాపద, మా, పద, మాతటిల్లతా
భ్రమణము లర్థభావము, లిరమ్మద బృందము లా గుణావళుల్
ప్రమదము చెందకుండు టెటు పండిత నీలగళ ప్రకాండముల్
సుమరస పూరసార కృతి సుందరి, యందత్తి, కంద, మీయదే?.

తే. సుధలఁ జిల్కెడు ఘన పదస్ఫూర్తి, పాత్ర సస్యపోషణముం జేయఁజాలకున్నె!
హృదయములకు నాహ్లాదమౌ నృత్యగీతముల ఘటింపంగఁ దన్నృసింహుండు మెండు.

ప్రస్తుత నివసము,
విజయవాడ.
1—12—1938

కవిశేఖర
అ. హనుమంతరాయ శర్మ,
అవధాని.

---

నా సహాధ్యాయి యగు మతుకుమల్లి నరసింహశాస్త్రిచే రచియింపబడిన హనుమద్విజయమను నైదంకముల నాటకమును మా సోదరి గుడిపూడి ఇందుమతీదేవి పంపగా నామూలాగ్రముగా జదివి యానందించితిని నాటకమంతటను నరసింహశాస్త్రి యొక్క చిన్ననాటి భావములే వ్యక్తము లగుచున్నవి.

నాటకమంతయు చక్కని సరళమైన శైలిలో నుండి ద్రాక్షాపాకమునం బడినది. భాష నిర్దుష్టముగ నున్నది. జాతికి భంగములేదు. పాత్రపోషణ చక్కగ జరిగినది.

గ్రంథకర్త నాటక ప్రదర్శనము లెట్లుండవలెనో తెలిసి యోజించి వ్రాయుటచే ప్రదర్శనమునకు మిక్కిలి యోగ్యముగా నున్నది.

మతుకుమల్లివారి వంశము తరతరములనుండియు పండిత కవులను ప్రసవించినది. మిత్త్రుడు నరసింహశాస్త్రియు, సోదరి గుడిపూడి ఇందుమతీదేవియు వంశ క్రమానుగతమైన కీర్తిని నిలువబెట్టిరి.

ఈ వంశము ఇంకను బెక్కురు కవితల్లజులంగని ఆంధ్రభాషా సేవ యొనర్చుగాక.

శ్రీ చి. సౌ. సోదరీ !

నీవు దయతో పంపిన హనుమద్విజయ నాటకము నందుకొని యానందముగా జదువుకొంటిని ఈ యానందములో పాల్గొనుటకు మన సోదరుడు నరసింహశాస్త్రి లేడుగదా! ఇది చదువునప్పుడు చిన్ననాటి దినములు జ్ఞాపకమువచ్చినవి.

ఈ గ్రంథమును ప్రకటించి మీరు మంచిపని చేసితిరి. శాస్త్రి పేరు, బహుకాలము ఆంధ్రలోకము విస్మరింపకుండును గాక. ఈ చిన్న యభిప్రాయము నిందు బంపుకొను చుంటిని.

గుంటూరు
శారదా నికేతనము
3—11—47

ఇట్లు
సోదరుడు
ఉన్నవ లక్ష్మీనారాయణ.

శ్రీ రామ

శ్రీ మాల్యశైల నృసింహ సహాయము.

# లంకాదహనము

## [నాటకము]

## కవివంశము

---

గీ॥ శ్రీలు దైవార వెలయు తెనాలి యనెడు
పురము కాపురమగుచుండ ƒ భూరికీర్తి
వెలయువారలు ఘను లారు ƒ వేలవారు
చెలగు చౌషష్టి కళలచే ƒ నలరువారు. 1

సీ॥ రాజమాన్యులు రాజ ƒ పూజనీయులు రాజ్య
తంత్ర కలాప స్వతంత్రమతులు
రాచకార్యాళి నిర్వహణ సమర్థులు
శత్రుభీకరులు ప్రశస్తమతులు
ప్రఖ్యాతిగల పెద ƒ పమిడి చినపమిడి
సంస్థానముల మంత్రి ƒ సత్తములుగ
తొలుతఁగాణాచియై ƒ వెలసెడు మతుకుమ
ల్లీపురనాథుఁడై ƒ లీలనలరు

గీ॥ రాజగోపాలదేవుని ƒ రాజితాంఘ్రి
సేవ నాసక్తమతి విరా ƒ జిల్లువారు
తొల్లి మావారలు మతుకు ƒ మల్లివారు
విదిత కాశ్యపగోత్రులై ƒ వెలయువారు. 2

ఆ॥ వె॥ ఆ కులంబునందు ƒ నలరెడు వెంగళా
ర్యాది బుధులు మాలి ƒ కాచలేంద్ర
వాసు శ్రీ నృసింహు ƒ వరభక్తి సేవించి
కవివరేణ్యు లౌచుఁ ƒ గ్రాలువారు. 3

సీ॥ ఆ సత్కులంబున నవతరించిన మేటి
మాధవ శాస్త్రి నా మలయు ఘనుఁడు
అభినవ భారతం బను ప్రబంధంబు ర
చించె నీధిగుఁ డీ రఘునఘుసుతుఁడు
నరసింహశాస్త్రి య నఁగ శబ్దశాస్త్ర త్రి
యీవిచక్షణుఁడౌచు నెసఁగినాఁడు
వరమతి పాంచాల వాసుదేవుండను
బుధవరేణ్యునికూర్మి పుత్త్రియౌచు

గీ॥ నలరుకవయిత్రి నాంచార మాఖ్యఁదనరు
చారుముఖి గర్భవారాశి చంద్రుఁడతఁడు
నాబుధేంద్రుని సతియా ననంతలక్ష్మి
చదలపాకకులాబ్ధి సంజాత యామె. 4

ఉ॥ ఆ మిథునంబుగాంచెను బు ధాగ్రణియౌ కనకాద్రిశాస్త్రినిన్
ధీమతి మంగళాద్రిని సు ధీనిధిమాధవశాస్త్రినాఁగ సి
ట్లీమువురుంద్రిమూర్తులన నెన్నఁగనొప్పిరి యగ్రజాతుఁడీ
భూమినిఖ్యాతిగాంచెఁ గవిపుంగవులౌనన సత్కళోన్నతిన్. 5

గీ॥ ఆ బుధాగ్రణి యౌ కన కాద్రిశాస్త్రి
మాకుఁ బ్రపితామహుం డనా మాన్య పాండి
తీగరిమచే జయించునా వాగధీశు
జానకీలోచనోత్పల చంద్రుఁడితఁడు. 6

సీ॥ బహుబంధుజన కుటుం బములఁ బోషించెను
బహుదానశీలతఁ బరగినాఁడు
బహుశాస్త్రభావసం పదల మించిగ్రహించె
బహురాజసమ్మాన పటిమఁ గాంచె
వంశదీపకుఁ డౌచు వరకీర్తిరాజిల్లెఁ
దలిదండ్రి సేవలఁ దనియఁజేసె
చిలకలూర్పేటయుఁ జెలగు సత్తెనపల్లి
నరసరాయనిపేట నరపతులును

గీ॥ పరగరేపల్లెపురవర ǂ పాలకుఁడును
అమరనమరావతీపట్ట ǂ ణాధిపతియు
నీబుధగ్రామణిఁగాంచి ǂ యెలమిమించి
పూనిసభలందు సత్కార ǂ పూర్వకముగ
నిడినమాన్యంబులే పెక్కు ǂ లిపుడుగలవు. 7

గీ॥ ఈమహాపురుషవరుఁ డా ǂ ర్జించినట్టి
ధనము తనబంధులకుఁ బంచి ǂ తానెయిచ్చె
ననుగుఁదమ్ముల నొనరించెఁ ǂ దన సములుగ
నతఁడె కనకాద్రిశాస్త్రిదా ǂ నలరుధైర్య
విజితకనకాద్రియౌటన ǂ వెలసినాఁడు. 8

గీ॥ ఇతఁడుజానకియందున ǂ సుతుల ముగురఁ
గాంచె జగదేకవిఖ్యాత ǂ కవివరేణ్యుఁ
డైన నరసింహశాస్త్రియుం ǂ దగ్రజుండు
నతఁడెపోమాపితామహుం ǂ డఖిలవేది. 9

గీ॥ కృష్ణశాస్త్రి తదనుజుఁడై ǂ గెరలియాంధ్ర
రచనమొనరించె విశ్వపు ǂ రాణమొందు
సరసుఁడతనితమ్ముఁడురామ ǂ చంద్రశాస్త్రి
వీరిసంతతియిపుడును ǂ వెలయుచుండె. 10

గీ॥ ఆ నృసింహ కవీంద్రుఁ డర్థాంగియైన
రంగనాయకమ్మం దను ǂ రక్తిమించి
ముగురు తనయులఁ గాంచెను ǂ ముదమెలర్ప
అందు మాతండ్రి మధ్యముఁ ǂ డౌచుఁ దనరు. 11

క॥ నరసింహ పదసరోజ
స్థిరభక్తి రతుండునగుచుఁ ǂ జెలగు ఘనుండా
నరహర్యాఖ్య సమాఖ్యుం
డరయఁగ మాతల్లి పంత ǂ మాంబిక యనఁగన్. 12

గీ॥ మరలఁ దూము వెంకటరత్న । మంత్రివరు ద్వి
తీయపుత్త్రికను వరించి । తిని ముదమున
నామె జానకి యనుపేర । నలరునామె
యందు జనియించె నొకకూతు । రరయ నాకు. 13

గీ॥ నామమునఁ గమలా రంగ । నాయకియగు
నరయఁగఁ ద్రివిక్రమాఖ్యచే । నలరు నామ
భాగినేయునకు నొసంగి । పరిణయంబుఁ
జేసితిని గురుబంధుల । చిత్తమలర. 14

గీ॥ లక్క రాజుకులాంబుధి । లక్ష్మిఁబోలు
మహిత వేంకటరత్నయా । మాత్యపుత్త్రి
పంతమ యనంతలక్ష్మినా । మాంతరంబు
నందె నీమెయీమిథునంబు । నందుఁ గలిగి
రేవురాత్మజులు సుతుండ । నేనొకండ. 15

గీ॥ మాతులుఁడు వెంకుకంతులక్క । ఖ్యాతివెలయు
సత్యశీలుండు శ్రీరామ । చరణభక్తుఁ
డతని కూఁతురు తొలి భార్య । యగును నాకు
నామెకమలాల యాఖ్యాత । యరిగె దివికి. 16

గీ॥ ఒనర నాంగ్లేయ సేవనో । ద్యోగినైన
నేను గవనంబు చెప్పుట । కూనినాఁడ
నందు నాటకమిది మొద । లౌటఁబలుకఁ
గానదోషంబులే పెక్కు । గలిగియుండు
నేమి సైచుడు బుధవరు । లెనయుకూర్మి. 17

గీ॥ రామవిభుకథ యన నన్యరక్తి మెండు
అందు మరుదాత్మజుని సాటి । యాదు రెవరు?
గాన కడుభక్తిమీఱ లం । కాదహనము
నాటకంబుగ రచియించి । నాఁడ నేఁడు. 18

సీ॥ మహిత పతివ్రత ౹ మాతల్లికి ననంత
లక్ష్మికి జోహారు ౹ లనురచించి
నరసింహాపద భక్తి ౹ పరుఁడు మాజనకుని
చరణాబ్జములకు నం ౹ జలి ఘటించి
సత్కవీంద్రులకెల్ల ౹ సాష్టాంగమొనరించి
భరతమాతకుఁ బ్రీతిఁ ౹ బ్రణుతిఁ జేసి
సూరివంద్యుఁడు నేతి ౹ సుబ్బరాయార్యుని
పదములు మదిలోనఁ ౹ బదిలపఱచి.

గీ॥ మాకు "కులదైవమైన శ్రీ ౹ మాల్యశైల
శ్రీనృసింహునకును" నతిఁ ౹ జేసి భక్తి
చిన్న నాటకమిది నేడు ౹ చెప్పవాఁడ
గురులు నేర్పిన పలుకులే ౹ కూర్చి నేను. 19

క॥ సిరిహారుల నెఁబరగెడు సు
స్థిరపుణ్యులు మాతృపితృల ౹ సేవించి "సుధా
కరునకును నూలుపోగిడు
కరణి" సమర్పింతు నాట ౹ కము కడు భక్తిన్. 20

శ్రీమాల్యశైల లక్ష్మీనృసింహ దేవతాభ్యో నమః

---

# ఇష్ట దేవతా ప్రార్థన

ఉ॥ శ్రీజనకేశపుత్రిఁగని ఽ చిత్తమురంజిలఁ బ్రీతినామె కా
రాజితకీర్తిశాలిరఘు ఽ రాముని సేమము దెల్పి లంకని
స్తేజనుగా దహించి వడి ఽ సింధువుదాటిన వాయుసూనుఁడ
వ్యాజకృపా కటాక్షమున ఽ నారయు నీకృతి నెల్లవేళలన్॥ 21

ఉ॥ శ్రీ మిథిలాధి నాథసుత ఽ సేమముదెల్పిన ఽ మారుతాత్మజుం
బ్రేమదలిర్పఁబల్కు రఘు ఽ వీరుసుధారస మంజువాక్యముల్
తామరసాభ నేత్రములు ఽ దారకృపారస పూరితంబులై
కామితదాయకంబులగుఁ ఽ గావుతఁబ్రోచుత నెల్లవారలన్॥ 22

ఉ॥ కోతుల నెల్ల పుల్లులను ఽ గోయలబోయలఁ గొమ్మకొక్కలన్
రాతినిదాప సోత్తముల ఽ రక్కసిమూకల నద్వితీయ ని
ర్హేతుకజాయమానకరు ఽ ణోదుసుధారస శీకరాళిసం
ప్రీతినిదన్ను దాశరథి ఽ వేడ్కశుభంబులొసంగు నెయ్యెడన్॥ 23

ఉ॥ శ్రీ కమలాలయా సతి శు ఽ చిస్మితయై పరిహాసవాక్కులన్
లోకవిభూ! యివేటిరద ఽ ముల్ సఖముల్ ముఖమంచుఁ బల్కనా
లోకితరాగ దృష్టుల వి ఽ లోలమనోంబుజఁ జేసి భర్తర
క్షాకలితాత్మ రూపమను ఽ నట్టినృసింహుఁడు ప్రోచునీకృతిన్॥ 24

---




## ప్రథమాంకము

(సూత్రధారి ప్రవేశించి)

పుష్పాంజలియై

ఉ॥ కోతుల నెల్గుపుల్గులను గోయెల బోయెలఁ గొమ్మగొమ్మలన్
రాతిని దాసోత్తముల రక్కసులమ్మని నద్వితీయ ని
ర్హేతుక జాయమానకరు ణేందు సుధారస శీకరాళి సం
ప్రీతులఁ జేయు దాశరథి వేడుకమిమ్ముఁ మమ్ము నోమెడున్.

(పువ్వులు చల్లి)

పారిపార్శ్వకా! యిటురమ్ము.

పారి: ప్రవేశించి యేమియాజ్ఞ,

సూ: ఆలసింపక లంకాదహన నాటక ప్రదర్శనమునకుం దగిన ప్రయత్నం బొనర్పుము.

పారి: అంతయు సిద్ధమొనర్చితినిగాని, యీ నాటకము రచియించిన కవియెవరు?

సూ: కవి యెవరా? కవి సామాన్యకవియే. కవితయు సామాన్య కవితయేగాని, కవిజన్మించిన వంశముకవితాకాంతామతల్లికిఁ బుట్టినిల్లు.

పారి: అనగా ఇంటిపేరేమి?

సూ: మతుకుమల్లి

పారి: మతుకుమల్లివారా. కవిపేరు.

సూ: జగత్ప్రసిద్ధ కవీంద్రుఁడగు నరసింహశాస్త్రిగారికిఁ బౌత్రుఁడు

పారి: ఓహో సరి, ఆయన పేరు.

సూ: పితామహుని నామమే. గుంటూరులో నున్నప్పుడు నేతి సుబ్బ రాయ శాస్త్రిలవారికడ విద్యగఱచెను. ఇటీవల తిరుపతి వెంక టేశ్వర శతావధానులకడ కొంత పాండిత్య మభ్యసించెను.

పాటి: అలాగనా? సంతోషము. నేనిఁకఁ బోయివచ్చెదను.

సూ: మంచిది. త్వరగా రండు (నిష్క్రమింతురు)

(రాముఁడు లేడిని వెంబడించుచుఁ బ్రవేశము.)

కీర్తన - కాంభోజి.

రాముఁడు

ఇదె కొందును - శ్రమగాని- క్షమగాని - సరగున లేడిని ॥ఇదె॥
నతులిలగోరిన - కోర్కెలు భర్తలు - అనయముదీర్చుట - హిత
మగుఁగాదే॥

ఆ యిదేమి, అమంగళము శమించుఁగాక, హితమనుదానికి, అహితమని స్ఫురించుచున్నదేమి?

గీ॥ అదిగొ యిదిగొ చేఁజిక్కెడు ననెడునాన
గొల్పుచును నన్నుఁగడు దవ్వు గొంచుఁదెచ్చె
నెట్టు లసువులతోడనే నీ హరిణముఁ
బట్టి సీతకు నీఁ గల వాఁడనొక్కొ?

ఆహా, యిదేమి?అందని మ్రానిపండ్ల కాసించినట్లయ్యె, లక్ష్మణు పలుకులు, ననాదరణంబొనర్చి, యీమాయా మృగంబుకు వెన్నంటి కడు దవ్వే తెంచితిని. దీనింబట్టుటెట్లు? చంపుటెట్లు? కానిమ్ము,

గీ॥ సాధు మృగములనైనచోఁ జంపఁదగదు
నిజముగానిది దైత్యుఁడై నెగడనోపు
తమ్ముఁడాడిన పలుకులే తథ్యమరయ
సితకలంబకమున దీని క్షితిని గూల్తు.

'రాముఁడు' బాణము విడచును.

(తెరలో) హా లక్ష్మణా! సీతా! అనుధ్వని.

కీర్తన - భైరవి

రాముః- హా! భువి విశిక ని యెఱుంగ - నరయ నీ కపటమెంచ ||హా||
బాపురె పసిడి మృగంబేడ - పచరించెను మాయలేడ ||హా||
కారడవుల మెలగులేమి - కాంతానుజ సహితుడనై
పేరాసలనందుచునే - డీరీతిని వచ్చుటేమి ||హా||
అందియుందనట్లు తోచి - యతి దూరముననుగొని చని
మ్రిందుచు సౌమిత్రీ! యని - మాపలె నిది కూయుటె కట ||హా||

ఇదియంతయు నన్ను వంచింపనెంచిన దానవ కపటోద్యోగంబు. ఏమిది, ఎడమకన్నదరుచున్నది, పర్ణశాలకడ, కీడు వాటిల్లలేదుగదా! లక్ష్మణుండుండ, నేమిభయము? అయినను, హృదయ భేదకముగ నీడు అఱచిన, అఱపువిని వారెటులెంతురోగదా! నేనిక నాలసింపక, త్వరగా నివాసంబునకరిగెద. (రాముడు పరిక్రమించుచు.)

(లక్ష్మణుడు ప్రవేశము)

కీర్తన- కాంభోజి

భ్రాంతమోముచూతునెటుల - పలుకనునేను నేనిక ||భ్రాం||
సీతనడవి నొంటివిడిచి - యేతెంచితినయ్యో ||భ్రాం||
సీతను గాపాడుమంచు - జెప్పిన యన్నతిమీరితి ||భ్రాం||
వదిననన్నుబలికినయా - వాడిపలుకులెటు లెఱిగింతును ||భ్రాం||

(రాముడు దృష్టి నిగుడించి యేమీ సీతనువిడిచి, లక్ష్మణుం డిటువచ్చుచున్నాడేలనో?) (లక్ష్మణుడు సమీపించును)

రాముడు: తమ్ముడా !

గీ|| కుటిలదైత్యనివాస మీ ఘోరకాన
నంబు జానకినొంటిమై నను విడిచి
యేలవచ్చితి?లక్ష్మణా! యెట్టులగునొ?
బాల యట ఘోరమృగదైత్య పాలిచేత.

(లక్ష్మణుండు నమస్కరించి) అన్నా!క్షమింపుము, 'లక్ష్మణా' యనెడు, నార్తధ్వనివిని, నేనెంతధైర్యము చెప్పిననువినక, జానకీదేవి

నిష్ఠురవాక్యంబులతో, నన్నుఁ జీకాకుపఱచి మీరక్షణకై పొమ్మని త్వరపెట్టుటచే నేతెంచితిని.

రా: తమ్ముఁడా! నీయట్టిధీరుఁడే, యాఁడువారిమాటలకుఁ గలతనంది, యోజింపక, త్వరపడిరాఁదగునా?

గీ॥ నేను నీవును లేనిచో ॥ నెలతమిన్న
భీకరారణ్యమునఁజాల ॥ బెగ్గడిలదె?
కఠినదానవు లామెను ॥ గష్టపెట్ట
కుందురే? హానియొనరింప ॥ కుందురొక్కొ?

లక్ష్మ: అన్నా! నామనవి, చిత్తగింపుడు, వదిన నన్నాడినమాటలు వక్కాణింపఁదగనివి.

గీ॥ అన్నకాపదగల్గిన ॥ యపుడుతోడు
చనని కుమతివి నీదు రక్షణమునొల్ల
అన్నపో ననుఁ గోరు దు ॥ ష్టాత్ముఁడనుచు
వినఁదగనిచెడుమాటల ॥ ననియె నన్న!

అగ్రజా! తమపాదసేవకుఁడ నగునేనిట్టి, హృదయ పుటభేదకంబగు, క్రూరవాక్యంబులకుఁ జింతాకులుండనైతి.

గీ॥ నిందఁబొల్పడియచ్చట ॥ నిలువలేక
నీయనుజ్ఞ నుల్లంఘించి ॥ నిజము నేడు
నీదుకోపానలంబున ॥ నీరగుటయె
మేలనుచు నెంచివచ్చితి ॥ మేదినీశ!

నేనొనర్చిన, దోషంబునకుఁ దమచిత్తంబు తెఱంగున నొనరింపుడు.

రాము: తమ్ముఁడా! అలసింపక పర్ణశాల కేగుదము రమ్ము.

చిత్రము. (నిష్క్రమింతురు.)

## పర్ణశాల

(రామలక్ష్మణులు ప్రవేశము)

రాముఁడు: (పర్ణశాలవంకఁ జూచుచు) తమ్ముఁడా! పర్ణశాల చిన్నఁబోయి యున్నది. జనకాత్మజ మనరాక కెదురుచూచుచు ద్వారంబుకడ నిలిచియుండదేమి? లక్ష్మణా! మాటాడవేమి? కారణ మేమి? తమ్ముఁడా! యేదిరా! జానకి లేదురా! (రాముఁడు అటునిటు తత్తరమునఁ బరిభ్రమించును)

రాము:

మ॥ అనుజా! యెన్నఁడు నన్నుఁబాసి చనదే । యావంతకాలంబెటుల్
జనదే నవ్వులకైన డాగదు సరో । జాతాక్షి నన్బాసి తా
నని మేమత్త్వమునూని చూచు నిమిషం । బబ్దంబుగా నెంచు ని
వ్వని నేమాయెనొ? యేదశంగనెనొ? యే । వంకన్ సతిం గాంతురా?
అనుజా! పల్కవేమి, యేమిచేయుదము?

లక్ష్మ: అగ్రజా! మారాముట కేమియుం దోచకున్నయది. ప్రొద్దుపోకకై యామె యావనంబుననే తరులతాదులం గాంచుచుఁ జరించుచుండెనేమో? (రాముఁడును పరిభ్రమించుచు)

కీర్తన - కమాచి

జనకజాతనుగంటివే? - చందనభూజమా!
వని విహరించుచుఁ - వలనీడ నిలిచెనా? ॥జ॥
వంతగుందుచు ని - న్నెంతో వేడెదన య్యా
సుంతప్రేమనాపైఁ - జూపివే శలవిమ్మా ॥జ॥
పథికశ్రమమునఁ నీ - పజ్జ నిలిచెనేమో
పథమునదప్పియింక - బడలియుండినదేమో ॥జ॥
హా జానకీ! నీజాడ దెలియు టెట్లు?

సీ॥ పీనపయోధర । జానకి జాడ నా
కెఱిగింపరే? ధరాధరములార !
మందగామిని ధాత్రి నందనన్ జూపరే ?
కడుఁబ్రీతి సోమ త్ర్యగజములార!

కలకంఠివై దేహి ॥ కానలోఁ గానరే?
మతినెంచి కలకంఠ ॥ వితతులార!
శీతకురంగాక్షి ॥ సీతనుఁ గంటిరే?
యరసి తెల్పుఁడి నాకు ॥ హరిణులార!

గీ॥ సరసగుణనిధిఁ గంటిరే? ॥ సరసులార!
సరసిజములార! కంటిరే? ॥ సరసిజాక్షి
మధుకరములార! కంటిరే? ॥ మధుపవేణి
తెలిసిన నా మెజాడలు ॥ దెలుపగదరె!

గీ॥ జాలిఁబడి నేఁడుగ మీరు ॥ జాలిమాలి
దాఁగ మారాడకుంటిరే ॥ తెలిసి కటకట!
యాలిఁ బాసిన నాకు ॥ యాలకించి
తెలిసేయక దెల్పుఁడీ ॥ బాలజాడ.

గీ॥ బాల జవరాలు నాయకు ॥ రాలు ముద్ద
రాలు ప్రాణాలకును మిన్న ॥ యైచరించు
కానలోఁ గోనలో నెందుఁ ॥ గానరాదు
గోలుపోయితి నిల్లాలి ॥ బేలనైతి.

హా జనకరాజపుత్త్రీ! నీవు గానరాకుంటచే, లోకమంతయుం జీకటియై, శూన్యముగనున్నది. యింక నిన్నెందుఁ గందునే, నీవు నా చెంగటనుండుటచే, నాకీ యరణ్యము, అయోధ్యవలెనే యున్నదిగదే!

సీ॥ కంటకోపేతమా ॥ కర్కశారణ్యముల్
శశికాంతసౌధరా ॥ జంబులయ్యె
పుణ్యజనోత్కీర్ణ ॥ భూములు జానకీ
పుణ్యజనోత్కీర్ణ ॥ భూములయ్యె
శ్రుతిపుటభేద్య బృంహిత గర్జనధ్వనుల్
శ్రుతిపేయ కలకంఠ ॥ రుతములయ్యె
ఫల జలానిల మూల ॥ పర్ణాశనంబులే
మద్రసోపేత భో ॥ జనములయ్యె

ఆ॥ వె॥ నీదుచెలిమి కతన నీరేజ ముఖి! మాకు
'పరుసమునను ముమార్చు పసిడిరీతి'
"సఖుల దుఃఖరోగి కౌషధం బిలభార్య"
యనెడు నీతి సార్థ మయ్యెనబల!

లక్ష్మ:- అన్నా! ఇదేమి ధీరోదాత్తులరగు మీరలే ధైర్యంబు గోల్పోయినచో, నవరేమి చేయగలరు?

కీర్తన - కేదార - ఝంకరా॥

లక్ష్మ:- పాడియె మీరిట్లలుగుండఁ - బామరులకుఁ జెల్లుఁగాని
భావికార్య మెంచవలయు - భామజాడ దెలియవలయు ॥పాడి॥
రాము:- సీతజాడ దెలియుటెట్టుల - తెలియుదనుక సైచుటెట్టుల!
సీత ప్రాణయుతను గాఁగ - నేతఱి నేగందునయ్యా! ॥సీత॥
ఎన్నడెవ్వరైననిట్టి - బన్నములనుగుడిచిరే?
కొన్నిన బోడిఁ బాసితి - ఘోరకష్టములను బడితి ॥సీత॥
లక్ష్మ:- ధాతవ్రాత దేహధారి - దాటగలఁడె? రామచంద్ర!
సీతకొఱకుఁ జింతిలకుము - చేరు న్ను దేవి మగుడ। ॥పాడి॥

అన్నా మీరిట్లువగల నొగలవలదు, వలనగునంతదనుక వదినను వెదకుదము. ఆమె యెందును గానరానిచో,

ఉ॥ త్రవ్వెద ధాతకుండియలు వ్రక్కలు చేతు సురారివర్గముం
జొచ్చెదనాగలోకముల సుక్కణఁగఁజేతు ఫణీంద్రుభోగముల్
హెచ్చగుదోర్బలంబున సుమేరుని జెండెద వార్ధిఁ గ్రోచ్చెదన్
దెచ్చెద దేవి నెల్లయున దేవరపాదము లాన రాఘవా!

క॥ ఈ పదునాలుగు భువనము
లేపున శోధించి శౌర్య మేపారంగా
భూపుత్త్రి సీతఁ దెత్తము
భూపాలక మౌళి! వగలఁ బొగలఁగనేలా?

అన్నా! శోకమును బోద్రోట్టి ధైర్యంబు చేపట్టిలెండు జగజెట్టివగు రాపట్టివి. నీకిట్టిచో, దీనత నూను టెట్టులర్హంబు? జనకుపట్టిని నీయడవి పట్టంతయు వెదకుదము, తరువాతి కర్జంబు, రూచింతముగాక రండు. (ఇద్దరు పోవుదురు.)

(అరణ్యము)

(రామలక్ష్మణులు ప్రవేశము)

రాముడు:

సీ॥ మాసీత నీ ఛాయ ॥ మసలియుండినదేమొ ?
చూతమా! తెల్పవే ॥ ప్రీతి నాకు
మృగనేత్రి మిముఁ జూచి ॥ బెగడుచెందెనో తెల్పు
డాజాడ లిటమృగ ॥ రాజులార !
శ్రీరామ!యనునామ ॥ మే రక్తిఁదలఁచు నా
రామఁగంటిరె? వన ॥ రామలార !
సరసిజపాణి? నీ ॥ సలిలంబుగ్రోలెనా ?
కవతెల్పగదే స ॥ రోవరంబ!
గీ॥ కుసుమ పేశలగాత్రి నా ॥ కుందరదన
సరసమతినెంచి కుసుమావచయ వినోద
రతినరుగుదెంచెనా? సుమ ॥ లతికలార !
మొఱుఁగఁబల్కుడి మతిదయ ॥ నెంచినాకు.

హా! యింకేటిసీత! యీ నా పాడుకన్నులకు మఱల సీతంగాంచు భాగ్యంబు గలుగునా?అకటా! నాయట్టి దురదృష్టవంతునకా! హాసీతా! వనితా జన విఖ్యాతా! సద్గుణసమేతా!

చ॥ ఎఱుగవు గర్భనారక మ ॥ దెట్టిదొ? భూమికి పుత్రివౌట నీ
వెఱుగవు గష్టమేమొ జన ॥ కేశుఁడు పెంచుట గూర్మిమీఱ దా
శరథిని నవ్వరించి మది ॥ నెంచుటగాక యరణ్యవాసముల్
తిరుగని కష్టముల్వడఁగ ॥ దైత్యులచేఁబడినావొకో? సతీ!

హాజనక రాజనందనీ! ధాత్రీపుత్రీ! అదృష్టహీనుండనగు నన్నుఁదఁ బాసితివా! హాలక్ష్మణా! విధిచైదంబున కడ్డులేదుగదా!

రాము: కీర్తన.

హాసీత పేశలగాత్రి - అబ్జపత్రవిశాలనేత్రి - యకటాయెటులోర్తు

లక్ష్మ:

వంతగుందనేల? నగ్గి - వడిగ నురికి మైనఁదెత్తు- వంతమలర వదిననీ-
పాదమాన రాఘవా!

గీ॥ పంచభూతములార! యా చంచలాక్షి
జాడ మీరలెఱింగిన సరఁగఁదెల్ప
రేని నీరుగా సేతు కో పానలమున
నబ్జభవశంకరులుగావ నడ్డమైన.

రాము:- లక్ష్మణా! యిదెచూడుము, వీఁడెవ్వఁడో మాయావి యగు రక్కసుఁడు సీత నపహరించి, కపటంబుచే మృతుఁడైనట్లు పడియున్నాఁడు, వీనిఁ దెగటార్తును.

తెరలో:-రామా! నేను జటాయువును, సీతను రావణుం డెత్తుకొని పోవుచుండ, వానికడ్డమై, ఘోరసంగ్రామం బొనరించి వానిచే నిహతుండనైతిని.

రాము:- తరువాత తరువాత, రావణుఁడెవఁడు?

తెరలో:- విశ్రవసుని కొడుకు, కుబేరుని తమ్ముఁడు.

రాము:- చెప్పుము చెప్పుము.

తెరలో:- రామా! నా ప్రాణంబులు నిలువవు,

రాము:- హా! హతవిధీ! (మూర్ఛిల్లును.)

లక్ష్మ,- అన్నా! రామప్రభూ! (విచారముతో విసరును)

రాము:- (లేచి) హా! సీతా! సీతా! జనకరాజ నందనీ! నీకెట్టి ఘోర విపత్తు వాటిల్లెనే 'లక్ష్మణా' యిది కలయా? నిక్కవంబా? నా కర్ణంబుల నే నమ్మఁజాల, పక్షీంద్రుఁడు హతుఁడయ్యెనా, నా కన్నులనే, విశ్వసింపఁజాల, రావణుఁడా? సీతనా? యపహరించెనా? ఛీఛీ, నమ్మను నమ్మను. నమ్మకుండుటెట్లు? కన్నులయెదుటనే, విహగేంద్రుఁడు, మృతినందెను, సీత గానరాకుండెను, రాక్షసుని రథ, రథ్య, సారథులు, హతమై, పడియుండిరి. జటాయువు, నిక్కమే, వక్కాణించినాఁడు, నా యభాగ్యమిట్లు, వర్తిలుచుండ, నింకను నమ్మకుండుటేల? హా యేమి తమ్ముఁడా!

గీ॥ రాజ్యమును బాసితిని యిట్లరణ్యమునకు
వచ్చితిని దండ్రి చనిపోయె భార్య పరుల
చేతఁబడెఁబక్షిరాజీల్గెఁ జెప్పనగునె?
కాల్పనీరైన నాయభాగ్యంబుఁదలఁప.

నాదురదృష్టంబున కంతంబులేదు, దుష్టరాక్షసునిచేఁజిక్కి నీవు మనియుందువా? కరింబాసిన కరణివలె, నన్నుఁబాసి నీవెంత గుందుచుంటివో? శార్దూలమునకుఁ జిక్కినహరిణివలె, నెంతయలజడి నొందుచుంటివో? ధరణీసుతా! సీతా! నీవుప్రాణసమేతవై, యుండఁగాఁజూచు భాగ్యంబు నాకు లభించునా?

లక్ష్మ: అన్నా! నగధీరుడవగు నీవే, ధైర్యంబు గోల్పోయి, యిట్లు పరిదేవనం బొనర్చిన, దీనుఁడనగు నేనేమి చేయంగలవాఁడ? నీబోటి గుణధన్యులు, ఆపదలవేళగదే, ధృతిమాని, కార్యంబు సాధించుట, చింతమానిలెండు. సీతాదేవి యునికిని దెలియుంగుటకు యత్నింతము, ఆమె యున్నచోటు, దెలిసెనేని, నీశరవారంబున కడ్డమున్నదా? రాఘవేంద్రా! లెమ్ము.

రాము: (లేచి) తమ్ముఁడా!

గీ॥ జనకు నచ్చెలియకాట నా సతినిగావఁ
గుటిలు నెదిరించి ప్రాణాలు గోలుపోయెఁ
బ్రతిఫలాపేక్ష లేకయే పక్షివరుఁడు (రాజు)
ఇట్టిమిత్రునిఋణమునే నీగుటెట్లు?

దుఃఖావిల మానసుండనై, కర్తవ్యంబు మఱచితిఁ. ఈ జనక తుల్యుండును, పరమమిత్రుండగు నీవిహంగ వల్లభుండు, వీరసమరంబొనరించి, వీరమరణంబు నొందెఁగాన, నితనికి వీరలోకనివాసంబు లభించుఁగాక, నేనీతనికి, నగ్నిసంస్కారం బాచరించుట కర్తవ్యంబు, ముందీకార్యంబు నిర్వర్తించి, పిదప, సీతజాడ లరయుదము.

(నిష్క్ర)

(బుజ్జడు, ఎజ్జడు,) (ఇద్దరు కిరాతులు ప్రవేశము)

బుజ్జ: ఓరి యెజ్జిగా, యెన్నిపిట్టల్నేసి నోవ్ ?

ఎజ్జ: వోరినీయెజ్జిగాల. కలికాసకేని, ఒక్కపిట్టేని లేదంటే, కాడంతా తిరిగి తిరిగొచ్చినాప్.

బుజ్జ: అగేటాప్, ఈయాల, ఓరికూడ, పక్కగువ్వన్న, సిక్కలేదటాప్?

ఎల్లి॥ ఈసిత్తర విన్నవరా?

బుల్లి॥ అదేటా?

ఎల్లి॥ ఈ పెద్దపెట్టు మీా న్నాట్టుంది, కాసుకుండే, ముసిలిగెద్దకి; పదితలకాయల, పచ్చితో, బలేదెబ్బలాటయిందిరా, ఆ గెడా బిడా దబాడబీయేట్ల, సప్పిట్లో, పహావట్లోకూడా, పక్కి పిట్టెని లేకుండా లెగిసి పచ్చుటన్ని, పారిపోయిసిరా! ఆసెట్ల సాటుసేసుకుని, అదేపాటిపోయి అల్లదుగో, ఆగుట్టసాటుగుండి సూసినా, ముసిలిగెద్ద సచ్చిపడిందిరా, దాన్నేన్నిపట్టికెల్లి, ఈయాల పొట్టనింపాలనుకుని, పరుగునే వచ్చినా,

బుల్లి॥ నీతెలివి మండిందిరా, పదితలలపచ్చోంటిరా? రాభణా భెమ్మ గాదటా? గద్దేంటిజటాయిరా. రావణ్ణి రిపెళ్ళాన్ని, ఆరామ్చేసు డెత్తుకెల్తుంటే, యీజటాయి, ఆణ్ణి సవగొట్టి, సచ్చిపోయిండు. ఆ గెద్దనే ఇప్పుడు, అల్లసూగో సూడు, ఆ సెట్టుకాడ, తెగలేసి, బూడిద, ఆ గోదాట్లో కలిపేసి, సీతమ్మోర్ని నెతుక్కుంటా యేడుత్తా, ఆ రాసోరిద్దరు ఇటేపొత్తుండారు, ఇంకా గెద్దనితింటావురా పెద్దమ్మా!

ఎల్లి॥ వోరీముదేటా? గద్దాటని తేటవేటి? యేట్లో కలిపేటమేటి? ఈ రాసాయనకలు, బుట్టగిట్టి ఉంటదో? ఈమొర్రిలో, మన్నేం జేసత్తో? లగెత్తిపోదాం పదరా! అదుగో ఆరాసోరు, దెగ్గరకే వొచ్చిండు. పదరా పదా, ఎర్రిమొకన్నా! (ఇద్దరుపోవుదురు)

(రామ లక్ష్మణులు ప్రవేశము)

రాము:- జానకీ! యీామందార వృక్షంబుకడ నిలిచితివేమి, లతాంగీ! నాపై కోపించి యిటకరుదెంచితివా?

లక్ష్మ:- అన్నా యిదేటిభ్రాంతి? అది మాలతీలత మందార తరువు నంటి యల్లినది.

రాము:- అయ్యో నాజానకిగాదా! (నడచుచు) తమ్ముడా, అదె మైథిలి వచ్చుచున్నట్లున్నది. ఆమె గిల్కుటందియల రవళి, వినుము.

లక్ష్మ:- అగ్రజా! కాదు. ఇటగనుము, హంసదంపతులు, విహారించుచు ఆనందముతో, సంభాషించురవళిగాదా?

రాము:- అబ్బా అంతయేనా? మహారాజా! అదృష్టమనదిదియే గదా! సతీవియోగదుఃఖ, సంతప్యమానసుండనగు నన్నుఁ గేలి సేయుటకా, దాంపత్యసుఖవార్ధిం దేలుచు, నాకెదురువచ్చుచుంటివి. (దృష్టిసారించి) అనుజా! అదెజానకిఁగొని, ఆదుష్టుఁడుపోవుచుండ, ఆమె విలపించుచున్నది, ప్రేయసీ! యిదె యిప్పుడే, నీ యిక్కట్టులం బాపెద విల్లెక్కుపెట్టుచున్నాఁడు.

లక్ష్మ:- చేయిపట్టుకుని, అన్నా! యిదేమి? ధృతిమాలి, జాలిపడి, భ్రాంతినందుచుంటిరి, శత్రుఁడు లేఁడు, జానకి లేదు, వట్టియలే, తిలకింపుడు!

రాము:- హా! హతవిధీ!

(కీర్తన)

అకటకటా సీతా-భూవిఖ్యాతా - అబలా! బాసితేనను ॥అ॥

సతినుఁ బాసితి-శాంతినశించెనే- గతివెతలంబడి- క్షితిమననోపను॥అ॥

రక్కసిచేతుల- జిక్కితపించెదే- పక్కికి రాతు చే-బడిపోగలేడుగతి ॥అ॥

తమ్ముఁడా! నేనింక నీ యుసురులు నిలుపఁజాల- సీతా రహితజీవితం బసహ్యంబుగనున్నది.

లక్ష్మ:- అన్నా! యివేటిమాటలు? నాథదైవతయగు, నామెకేయుపద్రవంబును వాటిల్లదు, ఆమెనపహరించిన, నీచుఁడు, చోరుఁడు, హతకుఁడు, ఆమెను దక్కించుకొనఁజాలఁడు, ఆశీవిషంబుతో, నాటలాడనెంచువానిగతిగాదే? భూపుత్రినిఁగాంచుటకు, శత్రునివాసస్థానం బరయుటకు యత్నింతము, ఈ దాసునిపై, దయయుంచి, ధైర్యమూనుము

రాము:- దిక్కులు చూచుచు,

కీర్తన

సీతా! పూతచరిత విఖ్యాతా- దయోపేతా-మృదులచరణ- భీతసారంగ వరనయన ॥సీ॥

వెంటనంటియున్ని నాళ్లు - జంటబాసికానలోన- ఒంటివానిఁజేసి వెదకు- చుండుమంచు (బోయినావె? ॥సీ॥

లక్ష్మ:- సర్వజ్ఞులరగు మీరింతవిలపింపనగునా? నామనవియాలింపుడు

సీ॥ జననంబు లోకప్రశస్తమా సరసీరు
హాప్తవంగడమునందైరహించె
జనకుండు దశదిశలను బర్వ సత్కీర్తి
గాంచిన దశరథక్ష్మావిభుండు
కూకటి ముడికినై కురులు గూడకమున్నె
తాటకిఁ గూల్చిన దర్పమరయ
చరణ రజంబునఁ జట్రాతి నాతిని
గావించు భవ్యప్రభావగరిమ
పురహారు చాపంబు పూఁపుల్లగనెత్తి
చిటుకునఁ ద్రుంచిన చేతిలావు
పసుపు బట్టలతోడఁ బరశురాముని భంగ
పఱచిన విఖ్యాత బాహుబలము
జనకు సత్యమునిల్ప ఘనరాజ్య మెడఁబాసి
తాపసివైనట్టి త్యాగగరిమ
యొంటిమై ఖరుఁడాది దంటల జగదేక
ధన్వివై గూల్చిన ధైర్యగరిమ
గీ॥ అట్టి నీవేడఁ? జోరుఁడా యసురుఁడేడ?
నీదుకోలదికి మీఱున దేదిగలదు?

రాము:- తమ్ముఁడా! సప్తవార్ధులు దాటనీది
మురికికాల్వను కాల్జారి మునుగుటాయె.

శా॥ ఆ రాకాసిపురంబు దారియిదె ఔ మ్మా! యన్న! పుణ్యాత్ములిం
దేరీ? జానకి సుప్రసన్నవదనం బేసీ ధరం గాంతు నా
క్రూరాత్ముల్ భయ దాహవస్థలిని నేఁ గూల్పంగ నెట్లోగదే!
శూరాగ్రేసరులేరి? తోడ్పడుటకున్ శుద్ధాత్మకులెవ్వరిలో.

లక్ష్మ:- అన్నా! మీరిందుకు సందియ మందనేల? అసుర పురమార్గం
బెరింగిన, నన్నియుం జక్కనౌను.

గీ॥ ప్రళయ మేఘార్భటుల లంక । పైని బాణ
వర్షమును గ్రుమ్మరించినేఁ । బాడొనర్చు
"అద్రి పవినింద్రుఁ డనఁ" గూల్చి । యసురవరుని
వెలయుదువు సందియంబింక । వీక్షమయ్య!

(తెరలో) కబంధుఁడు.

ఆ హాహాహా! నాకుఁ జిరకాలమునకు నరమాంస భోజనంబు లభించినది.

(రామ లక్ష్మణులు కబంధుని చేతులలోఁ బట్టుపడుదురు.)

కీర్తన - (రామ లక్ష్మణులు)

హా యిపుడెంతటి మోసమాయెన్ ॥హా॥ అసురుని చేఁజిక్కుట-టాయెన్-
వనిని సతింగనఁగొన వెదకెడుమన - లను బంధించెను గనుబడఁ
డసురుఁడు ॥హా॥

అకటకటా జానకిని జెరన్ బా - పక మనమంతంబగుదు మొకో-
మనఁగ నెటుల్ మనకగునో ॥హా॥

లక్ష్మ:- ఆహా! అన్నా! యిదేటికష్టము వాటిల్లెనయ్యా!

ఉ॥ పుట్టితి వర్క-వంశమున । భూపతి పంక్తిరథుండు తండ్రి చే
పట్టితి విద్యలన్ భువన । వంద్య వసిష్ఠమునీంద్రు నొద్ద నీ
యట్టి మహానుభావునకు । నకట యిట్టి పలాశి చేతిలోఁ
బట్టువడంగ వ్రాసెఁగట । పాపిగదయ్య విధాత రాఘవా!

రాము:- లక్ష్మణా! వీని చేతిలోనుండి తప్పించుకొనుట కుపాయమేమి?

గీ॥ వలదన వినక యడవికి । వచ్చి తోడు
కష్టముల నెన్నొ । గలిగిపఁ గానినన్నుఁ
గాచుచుంటివి తుదకు రా । కాసి చేతఁ
బడితివిఁకఁ జాలునీడాఁటఁ । బరిహాసమ్ము.

లక్ష్మ:- అన్నా! ఎంతకష్టము? ఎట్టి మాటలాడితిరి? ఈ దాసుఁడు
బ్రదుకుట ఎవరికొఱకని యో విూ రెఱుంగరే?

ఆ॥ వె॥ పిన్నదనమునుండి ॥ పీడక మీపాద
సేవఁ జేయుచుండు ॥ సేవకుఁడను
మిమ్ము ననురువాత ॥ మిడుక బోవిసినే
బ్రతుకఁగోరునట్టి ॥ పాపినొక్కొ ?

అన్నా! నాయట్టి యధముఁడు బ్రదికియుండి లాభమేమి? మీరలే యెటులైనఁ దప్పించుకొనిపోయి జానకీదేవి జాడ లరసి యామెం గైకొని యయోధ్యఁ బ్రవేశించి పట్టాభిషిక్తులగుడు. అట్టితరి నన్ను మాత్రము మఱచిపోవకుడు

రాము: తమ్ముఁడా! యేమంటివి? నిన్నీయసురుని పాలుచేసి నాదారినేఁ జూచుకొని సుఖంపుమంటివా? సత్యముకొఱకైన నేమోగాని రాముఁడు లక్ష్మణుని వీడువాఁడుగాఁడు, హా యేమియా కైకా! నీ కోరికలు నేటికిఁదీరెఁ గాఁబోలు. ఇసీ! యిదేమి తమ్ముడా! మన మిట్లు ధైర్యము గోల్పోవ నగునే ?

శా॥ ఏమేమీ? జనకాత్మజన్ మాని కొనినే ॥ డీరీతి ఘోరాటవీ
సీమన్ దానవవంచనామహిమచే ॥ సీమంతినిం బాసితిన్
భీమాటోప ఘనాస్త్రశాస్త యుతదో ॥ ర్వీర్యంబు గోల్పోతినే ?
సౌమిత్రీ! మదిఁ గుందఁబోకు మిదిగో ॥ శత్రున్ వెసం జెండెదన్.

కబంధుఁడు. (తెరలో) ఓరోరీ! మనుజాధములారా! నా చేఁజిక్కిన మీ రెండుఁబోఁ గలరు. మీ యిరువురను జిక్కించుట్టి మెక్కి నేటి క్షుద్బాధ నడంచువాఁడను.

రాము: తమ్ముఁడా! వీనితోటి మాటలేల? జాగు సేయక చెరియొక కరంబును దునిమి పోవుదము. కానిమ్ము (రెండు చేతులు నరకుదురు)

(తెరలో) కబంధుఁడు మహాత్ములారా! మీకివే యనేక ప్రణామంబులు మీదర్శనభాగ్యం బబ్బుటచే ధన్యుండనైతి.

లక్ష్మ: ఓయీ! నీవెవ్వఁడవు? నీవిట్టి వికృతాకారంబున నుండ నేల ?

కబం: నేను గంధర్వుండ. ఇంద్రశాపవశంబున నీపాడురూపంబేర్పడ అమహానుభావుఁడే శాపవిమోచనం బానతిచ్చె నేమనఁగా?

కం॥ శ్రీతను దశరథభూవిభు
జాతుండగు ఘనుఁడు నీభు । జంబులు త్రుంచన్
ఈతనువుపీడి పూర్వపు
నీతనువుం బొందెదవని । నింద్యచరిత్రా!

కావున మీకతంబున ధన్యాత్ముండనైతి. ఈ మహాభుజుండు, ఈ నీలతనుండు, దశరథనందన శ్రేష్ఠుండగు రాముండుగా నెఱింగితిని. నన్నా వృక్షకోటరంబున నుంచి దహించితిరేని నిజరూపంబుం గొనియెదను.

రాము. తమ్ముఁడా! యీతఁడు కోరినచొప్పున నొనర్పుము.

లక్ష్మ: (తెరలోనికి) గడతోఁ ద్రోయుచున్నాఁడు.

రాము: కబంధుని శరీరమంతయుఁ ద్రుటిలో నీరైనది. యేమది? ఆహా! దివ్యమయ సుందరాకార తనువుతో నిటువచ్చుచున్నాఁడు.

కబం: సుందరరూపముతో (కబంధుఁడు ప్రవేశము)

కబం: దశరథరాజనందనులారా! పురుషోత్తమా! రామా! నీప్రసాదంబున శాపవిముక్తుండనైతి. నాకు శలవిండు.

రాము: ఆ॥ వె॥ నాదుకన్నెఱంగి, । నాసతిగొనిచన్న
రాక్షసాధముండు । రావణుండు
ఏలువాఁడులంక । యీవునాదుష్టాత్ము
నెఱిగియున్నఁ గూర్మి । నెఱుఁగఁబలుకు.

కబం: క॥ దేవ! మతంగాశ్రమమునఁ
దావకపదకమలభక్తి । తత్పర శబర
స్త్రీవెలయుఁ దపశ్శాలిని
యావనిత సవిస్తరముగ । నంతయుఁ బలుకున్,

నేనింక బ్రహ్మలోకంబున కరిగెద. మీరు శబరిం గనుంగొనుఁడు.

రాము: సోదరా! జానకీదేవి వార్తయు రావణోదంతంబును, ఈతని వలనంగూడ దెలియదయ్యె. మన మా శబరిం గనఁ బోవుదమా?

లక్ష్మ: చిత్తము. (ఇరువురు నిష్క్రమింతురు)

(మతంగాశ్రమము)

(రామలక్ష్మణులు ప్రవేశము)

రాము :

శా॥ హా సీతా! జగదేకపూతచరితా! హా సద్గుణోపేత! హా
నీసౌజన్యము నీదుసౌహృద మహో! నీసాధుశీలత్వముల్
నీసామ్యోన్నతి యార్యభక్తి దయతో నీవార్తలం బ్రోచుటల్
నీసాదృశ్యము నీకునీవెగనఁ బో నేనెందుఁ బద్మాననా!

హా జానకీ! చోరాధముఁడగు రాక్షసాధమునిచేఁ జిక్కి యెట్టి యిడుములం బడుచుంటివో?

గీ॥ అకట నావంటి హీనుఁ బెండ్లాడుకతన
"నినుఁ దోఁగూడనగ్గికి నిడుములట్లు"
ఇట్టులిక్కట్లఁబడితి దిక్కేది నీవు
అడలిసుడిఁబడి యుసురులు విడిచితేమొ?

తమ్ముఁడా! యిదియే కాబోలు మతంగుని తపోవనంబు, ఇక మనకా శబరి గనుపించు టెట్లు?

లక్ష్మ: అన్నా! అటుగనుడు, ఆ వచ్చు వృద్ధాంగనయే శబరియైయుండ నోపు.

(శబరి ప్రవేశము)

కీర్తన

శబరి : జన్మసాఫల్యమాయె - జానకీపతి నిందుఁగంటి
కర్మబంధమోచనంబు - కలిగె రామమూర్తి రాఁగ.

గీ॥ "త్రాహిమాం" రఘునందన! దనుజహనన
భక్తచందన! భూజ తాపత్రయాగ్ని
ప్రావృషేణ్యాంబు నాహత భవసమూహ
శైలతనయార్చితా! నమస్కారములివె

గీ॥ ఎన్నిదినములనుండి నే నెన్నుకొనుచు
స్వాదుఫలములు దాచితి స్వామి! నీకు

నారగింపుము నేనిన్నుఁ గోరుచుంటి
నాతపంబులు ఫలియించు నలిననయన!

రాము: శబరీ! నీభక్తికిని, నీనిర్మల భావమునకును, మాకత్యంత సంతుష్టికలిగె.

గీ॥ నాసతీమణిఁ గొని రావణాసురుండు
నేగెనటలంక కే దారి నేగనగునొ?
వానినిర్జించి సతిఁగొన వలయునాకు
నెఱుఁగఁబలుకుము శబరి! నీ వెఱిగియున్న.

శబ: స్వామీ నా యెఱిగినంతవట్టు దెలిపెద నాలింపుడు.

గీ॥ వాలిచే నాలిఁ గోల్పోయి వనటఁజిక్కి
యనుచరులఁ గూడి ఋశ్యమూకాద్రినున్న
యినజు సుగ్రీవు, మేధావి వనచరేంద్రు
మైత్రి నెఱపుము దాన నీ మనములు గలుగు.

దేవా! తమ సాన్నిధ్యంబు నే యనలంబుఁ జొచ్చి యీ కళేబర త్యాగంబొనర్ప నెంచితిఁ గాన నాయుం దనుగ్రహంబుంచి ముహూర్తకాలం బిట నిలువుడు

శబ: (నిష్క్రమించును.)

లక్ష్మ: అన్నా! అదిగో శబరి యగ్నిం బ్రవేశించి స్థూలకాయంబుల విడిచి దివ్యదేహంబుతో దివ్యపదంబున కేగినది. మనమింక ఋశ్య మూకంబునకుం జనుదమా?

రాము: మంచిది (అట్లే యిరువురు పోవుదురు.)

(రామలక్ష్మణులు ప్రవేశము)

కీర్తన - కాంభోజి

రాము: సుందరి యీచందంబున - వందురునో కోకిల

లక్ష్మ: ఎందుకు మీ డెందంబునఁ - జంద్రాస్యకై కుంద

రాము: ఎప్పుడు బాయునీ - ముప్పులటంచును - నెప్పుడు నెన్నుచు నేమగునో సతి

లక్ష్మ: దండిభానుజుని -దండఁజేరరిపు-తండమునీభుజ-దండమెచెండదె?

రాము: తమ్ముఁడా ! అదియే పంపాసరోవరంబు - ఇదియే ఋశ్యమూకంబు.

లక్ష్మ: అన్నా! మనకష్టంబు లీడేరు తరుణంబేతెంచె ఈ పంపాసరోవరంబు సొంపును వీక్షింపుము.

రాము: (నిట్టూర్చి) లక్ష్మణా! పంపాసరోవరంబు సొంపును నింపును పెంపును నుతింప వేనోళ్ళ పాపతేడైన నోపునా? ప్రఫుల్లారవిందంబులచేతను, నీలోత్పలంబులచేతను, అరవింద గంధబంధుర మంద వాయువులచేతను, అరవింద మకరందపాన మత్తమధుర గానంబుల చేతను, మరాళకూజితంబులచేతను, విహంగరావంబులచేతను నెల్లవిధంబులఁ జానకిం దలపించుచున్నది. వియోగ వ్యథిత మానసుండ నెట్లు సహించువాఁడ? నీవు వేవేగమ చని సుగ్రీవునిం గాంచెదవా ?

లక్ష్మ: ఋశ్యమూకాచలంబు దరిసేగుదము రండు. తదుపరి కర్తవ్య మూహింపనగును.

రాము: మంచిది. (ఇరువురు నిష్క్రమింతురు)

ప్రథమాంకము సమాప్తము

---



# లంకాదహనము

(ద్వితీయాంకము)

ఋశ్యమూకపర్వతము

(సుగ్రీవుఁడు హనుమంతుఁడు ప్రవేశము)

సుగ్రీ: హనుమంతా! అదెగనేము, అశరశరాసన పాణులగు నా మహా పురుషులెవ్వరో? గాని, వారింజూడ భయంబుచే నాగుండె లవియు చున్నయవి.

ఉ॥ ఆరవివహ్ని తేజములు నాఘనదీర్ఘ మహాభుజంబులున్
ఆరమణీయ రూపములు నాపృథులోన్నత పీనవక్షముల్
ధారుణి నెందుఁ గానను బ్రతాప పరాక్రమ విక్రమక్రియా
దారుల సింహమధ్యములఁ దప్పక గాంచితిఁ బాసిరిన్ ధృతిన్.

గావున బుద్ధిమంతుండవగుదువుగదా!

చ॥ పవన తనూజ! నీవునిఁకఁ బాయక వేషక రూపమూని యా
హవజయశీలు రాహరిక రాక్షసు లెవ్వరో? వాలికుంటు న
న్నవమతి సేయవచ్చిరో కో? యారసి వారు విరోధులేని క
గ్గవల నొనర్చు సైగలు ముఖంబులు నవ్వుల తీరు గాంచుచున్.

హనుమా! వారల రహస్యం బెఱింగిరమ్ము.

హను: అట్లే నిజంబెఱింగివచ్చెద.

సుగ్రీ: హనుమా! వినుము. జాగుసేయకుము.

కీర్తన - కాంభోజి

మారుతాత్మజా! వారిచెంతకు న - వార్యవేగమునఁ
బరుగిడుమా - పరుగిడుమా - గనుగొమ్మా - మరిరమ్మా -
శుభమిమ్మా! ॥మా॥

హను: మది పదిలముచెడి - శంకకుమా!

సుగ్రీ: మదికుదురగు శుభ - వార్తలు దెమ్మా!

హను: స్థిరమతిగనుమా!

సుగ్రీ: త్వరగాఁ జనుమా!

హను: శత్రులనుచు మది - జంకకుమా!

సుగ్రీ: నేనీగిరి శిఖరంబు పైకిం జనెద.

హను: (చిత్తము) నేనిదెపోయి వచ్చెద.

సుగ్రీ: (నిష్క్రమించును) హనుమంతుఁడు నడచుచు దృష్టినిలిపి

కీర్తన

హను: కనియుంటినే యేనా - డీయందం బీచందం బేనిందున్
పూరుషాళినిట్టి - పూరుషోత్తములన్ ||కని||
వరమునివేషముల్ - మనసిజరూపముల్ - సరసిజనేత్రముల్ -
ఖరకరుతేజముల్ - సురుచిరాస్యముల్ ||కని||
కనుగొన మనమున మోదంబు - నినుమడించి పెనగొనన్
కనులపున్నె మనువుపడఁగఁ-గనుగొని యెదఁ దమిచెలంగ ||కని||
ఈవృక్షంబు నారోహించి వీరివృత్తాంబరసెదను (వృక్షమెక్కు-
చున్నాఁడు)

(వృక్షము క్రింద, రామలక్ష్మణులు, ప్రవేశము)

కాంభోజి - కీర్తన

లక్ష్మణుఁడు: అనఘ! రామ! భూజశాఖ - నలచుకొ్రతి గంటివే?

రాము: అనుజ! వీని లాతికోతి - యట్టులెంచఁ జెల్లునే?
కరము వెలుఁగుచుండె వీని - కర్ణకుండలంబులున్
బరమపుణ్యమూర్తి దివ్య - శోభల తేజరిల్లెడిన్

లక్ష్మ: అన్న! రాఘవేంద్ర! వీని - నరయ కల వొసంగినన్
సరసమతిని దెలిసివత్తు - సఫలమౌను గోరికల్.

హను: (చెట్టునుండి దుమికి) రామలక్ష్మణులారా! - మహాత్ములారా!
మీకివే వందనంబులు (చేతులు జోడించినిలిచి)

కీర్తన - కాంభోజి

హాను : శ్రీరామా ! సాకేతపురవాసా! శ్రీజానకీనాథా!-శ్రితజనాధారా!
నేనేమినోమునోచితినో-వేచివేచిస్వామి!నీదు- దర్శనమును గోరి
యుంటి- నీదాసుని గరుణించి - నాసేవలఁ గైకోవే ||శ్రీ||

మ॥ వినియుంటెన్మను నాదుకుండలము లే ? వీరు లసన్నేరు ? రా
ఘునులే శ్రీరఘు రామలక్ష్మణు లటు ? లాకున్న నన్యు లరన్
గనఁగానేరరు సత్యమీాకరణి నీ ? తమ్మాభారము న్మాన్పఁగా
జనసంబందితివా భళీ! రఘుపతీ! ? తమ్మకన్యకానాయకా!

రాము: తమ్ముఁడా! యీాతడెవ్వరో విచారింపుము.
లక్ష్మ: ఓయి! నీ వృత్తాంతమేమో? - సవిస్తరముగా నెఱింగింపుము.
హాను: దేవా! చిత్తగింపుడు

సీ॥ పృథు మేఘుఁ డెవ్వాని ? విక్రమంబున కోర్వఁ
డా మహాబలుఁడె నా ? యనుగు తండ్రి
అంజలి ఘటితమై ? యతుల తప మొనర్చె
నా సాధ్వి యంజని ? యరయఁ దల్లి
సకలజ్ఞుఁడు త్రిలోక ? సాక్షి భాస్కరుఁడు పాఁ
ఱదువులఁగరపిన ? సద్గురుండు
చిన్ననాఁడె విరించి ? చే నీఁబడినరామ
నామమంత్రజపంబె ? నామతంబు

గీ॥ అర్థిసేవింతు సుగ్రీవు ? నగచరేంద్రు
రామదాసుండ నే సదా ? రాము భవ్య
దర్శనము గోరుచున్నాఁడ ? ధన్యతముఁడ
నైతి,హాను మంతుఁడనుపేర ? నలగువాఁడ.
మఱియు స్వామీ! నా విన్నప మాలింపుడు.

గీ॥ ఆలిఁగోల్పోయి యన్నయాా ? వాలిచేత
తన్నుఁబడి ఋశ్యమూకాద్రి ? నున్నవాఁడు
అగచరేంద్రుఁడు సుగ్రీవుఁ ? డరసిమిమ్ము
తనకు వివరింప నన్నంట ? కనిపినాఁడు

అయ్యా! నారాయణాంశమున రామాఖ్యచే జనించిన పురుషోత్త
మని సేవింపు మని చతురాస్యుం డానతిచ్చె, సేవింపఁ గలిగితి.
మీ చరితం బానతిండు.

లక్ష్మ: అన్నా! "నెమకఁ బోయిన తీవె, కాలందవిలినట్లున్నదే"?

రాము: సోదరా! మన సమాచారం బీ సూనృతవాదికి, విశదపఱుపుము.

లక్ష్మ: ఆంజనేయా!

కీర్తన

కృపామతిని వినుమా-ఘన_నృపాలుఁడగు దశ-రథేను సుతులము ||కృ||
క్షితీశుఁ డప్పగఁగ సతీయుతుండై -వెతల్బడుచు వన- క్షితిన్వసించెను ||కృ||
దశాస్యుఁడటనీ -రఘూద్వహుని సతి - ధరాసుతన్ గొని - చనెన్మోసమున ||కృ||
నరోత్తముఁడు కౌ-సలేయుఁడీతఁడు పదార్చకుఁడ దా-సుఁడన్నిరంతరము ||కృ||

హను: దేవా! యీ వృత్తాంతంబంతయు సుగ్రీవున కెఱిగించి, అతఁ
డును మీరును, సఖ్యంబొనరింతురేని, పిదప వలయు, కార్యంబున
కంతయు, నాతఁడే తోడ్పడంగలఁడు గాన మంత్రవిదుండును పర
మంత్రోపాయ భేదన తంత్రజ్ఞుండును నగు సుగ్రీవుని కడకు,
వేగంబ చనుదెంచుట, శుభంబు, నాతో దయసేయుఁడు, సుగ్రీవు
నకుఁ దమ దర్శనంబొసంగుఁడు, లెండుఁ పోవుదము

లక్ష్మ: మాకంతకంటెఁ గావలసిన దేమి? పరమ సమ్మతమే కదా!

రాము: మంచిది. అందరు (నిష్క్రమింతురు.)

ఋశ్యమూకాద్రి

(సుగ్రీవుఁడు జాంబవంతుఁడు, నలుఁడు, నీలుఁడు ప్రవేశము)

సుగ్రీ: మిత్రులారా! అదుగో! బుద్ధిమంతుండగు, హనుమంతుఁడు, రవి
సుధాకరులంబోలిన యీ మహా పురుషుల నిర్వురందోడ్కొని,
వచ్చుచున్నాఁడు. వారి తేజం బద్భుతంబుగ నున్నది. వారు విద్వివ
దసహ్యాతర, విక్రమోన్నతులనుట వారి యాకృతులే చాటు
చున్నవి. వారి యాజానులంబ దోర్దండంబులు సర్వభూభరణ
సమర్థంబులై యున్నవి, వారేలనో? ఋషివేషధారులైరి. వారు

మనలం డాయవచ్చుచున్నకాలది, నామనంబున, భయాంబంతయుం బటాపంచలై విచ్చిపోయినది, ప్రియము, నయము, నానందంబును ముప్పిరిగొని, నాతనువు పులకితంబై యుప్పొంగుచున్నది అదే! వారు వచ్చిరి. మనమందరము జోహారులొనరింతము.

(రామ, లక్ష్మణ హనుమంతులు, ప్రవేశము)

(బండలపై పచ్చని యాకులు పఱచియుండును)

సుగ్రీ: మహాపురుషులారా! యిందు వేంచేయుడు.

(రామలక్ష్మణులు, కూర్చుందురు) వానరులు, చేతులు జోడించి నిలిచి యుందురు.

హను: (సుగ్రీవుని జూచి) వానరోత్తమా! యీ వీరోత్తములు, దశరథ రాజోత్తముని, పుత్రోత్తములు, వైరిగర్వాపహారణ పటిష్ఠ శస్త్రాస్త్ర, సంపన్నులు, రామలక్ష్మణులు, వీరి వలన నీ కార్యంబులన్నియు సఫలీకృతంబు లగునని నాతలంపు వీరితో సఖ్యంబొనర్చి నీచరితంబ తయు వివరింపుము.

సుగ్రీ: (నమస్కరించి) రామభద్రా ! యివె నావందనశతంబులు.

(వానరులందరును పాడుదురు.)

శ్రీరాగము - కీర్తన

పరిణతారిహరా!- పంకజనాభా! - మందరధీరా!- సీతానాధా!
నారదముని హృత్సంచారా! - భవనుత! మునిసతి పాపవిదూరా!
క్రూరదనుజముఖ్యవిరామా రామా!- భీమచాపభంజన తేజోధామ!॥ప్ర॥
గాధినందన పరికల్పితసవ సం - రక్షా! మునిహిత దీక్షాదక్షా!
శ్రీధరణీజ కరాంబుజచందన-లిపచారు పీనోన్నతవక్షా! ॥ప్ర॥
శ్రీరామచంద్రా! సుకీర్తిసాంద్రా!- కూరిమి గైకొనుమా!- మాదగు
సుగ్రీ: సేవలుపూజల్ ॥ప్ర॥

సీ॥ జోహారు దివ్యతే * జోరాశిపావన
చండాంశువంశ సం * జాతులార!
జోహారు దశరథ * క్షోణీశ్వరానంద
సత్పుణ్యవారాశి * చంద్రులార!

జోహారు దుష్టర రక్షోవీర సర్వని
కాయభీషణ వైనతేయులార!
జోహారు స్వపదర జోరేణుసంస్కృతి
ప్రశూళిశాఖల వపులార!
గీ॥ అస్మదగ్రజోన్మూలితా శావనీరు
హోద్ధరణ కరఘన మంత్రి సింహులార!
రామలక్ష్మణులార! యీ రవిసుతుండిదె
యర్పణమొనర్చు జోహారు లందికొనుడు

లక్ష్మ: వానరాధిపా! భానుతనూజా! మేమే నీకరుణకుం బాత్రులము; గాన నామాట లాలింపుము.

గీ॥ రవిసమోద్దామ తేజోవి రాజితుండు
మిహిరకులజుండు శ్రీరామ మేదినీశుం
డువిదంగోల్పోయి దుఃఖాగ్ని నవయుచుండె
జానకీహర్త యుండెడు జాడందెలిపి
పూని నీకృప నేలవే? వానరేంద్ర!

సుగ్రీ: రామచంద్రప్రభూ! నామనవి నాలింపుము.

ఉ॥ భానుకులాబ్ధిసోమ! పుర భంజనసంస్తుత నామ! రాఘవా!
దానవ యొకర్తె యాకసము దారుణపుష్పకమందుం బోవుచున్
మానక రామరామ! యనిమాటికి దిక్కులు మ్రోయ నేడ్చుచున్
మానిని వైచె నయ్యో! తన మండనముల్ముడిగట్టి మాకడన్.

రాము: సుగ్రీవా! యేమీ! వానిని త్వరగాం జూపింపుము.

సుగ్రీ:

గీ॥ ప్రాణసమముగ నే భద్రపఱచినాండ
వేగందెప్పింతు నవియె నీ వెలదివేమొ?
తెలియు మామీద జాడలు దెలిసిపట్టి
రక్కసుని యుక్కడంతము రాజవర్య!

సుగ్రీ: హనుమా! త్వరితగతిం జని, యానగలమూటంగొనివచ్చి, రామవిభునకొసంగుము.

(హనుమంతుఁడు, పోయి నగలమూటతోఁ బ్రవేశించి, మూట రామునకిచ్చును.)

రాము: (ఆతురతతో మూటవిప్పి చూచి) హా! సీతా! మహీసుతా! (మూర్ఛిల్లును.) లక్ష్మణాదులు ఉపచారము లొనర్తురు. (రాముఁడు తెలివినంది, నగలుదీసిచూచి.)

రాము: లక్ష్మణా! యీ నగలన్నియు మీవదినవేగదా ?

లక్ష్మ: అన్నా! క్షమింపుడు, ఈ నగలన్నియు నెన్నడును, జూచి యుండలేదు గాన నేగురుతింపఁజాల. నిరంతరము నను, జానకీదేవి పాదములకు వందనంబాచరించునప్పుడు, పాదములు మాత్రముఁ జూచియుంటచే, నీయందియలు, మట్టియలు, నీపాదభూషణంబులు మాత్రము వదినవని యెఱుంగుదు.

రాము: హా లక్ష్మణా! నాహృదయమెంత పాషాణతుల్యమోయి' జానకి దగ్గర లేకయు, నామె నగలఁగాంచుచు, బ్రీలిపోకున్నది, తమ్ముఁడా! యిటు చూడుము.

సీసపద్యము

ఇదిగదే నాసీత, । మెడఁదాల్చు హారంబు.

లక్ష్మ: రావణప్రాణ హారంబెయగును.

రాము: భూమిజ వ్రేలిది । ముద్దుటుంగర మిదే.

లక్ష్మ: క్షుద్రదానవ లయ । ముద్రయదియె.

రాము: మేదినీసుతదాల్చు । మేఖల యేయిది.

లక్ష్మ: పౌలస్త్యగళ కాల । పాశమగును.

రాము: మామగారిడినట్టి । మణికుండలములివే.

లక్ష్మ: కుటిలమారణ హోమ । కుండములివి.

రాము:

ఆ॥ వె॥ మేలిముసుగు కొంగు । మెలత సీతదిగాదె?
చించిమూటగట్టె । చెలువ నగలు

లక్ష్మ:

చింతవీడు మన్న! । సీతఁదెచ్చెదము రా
కాసితలల మూట । గట్టి దీన.

రాము: హా జానకీ! నాయట్టి యదృష్టహీనునిఁ గట్టికొని, యెట్టి యిక్కట్లంబడితివే?

కీర్తన - భైరవి

అకటకటా! యెంతదోస - మీరొనర్పఁ బాల్పడితిరో?
అకలంకమతిగ మిముఁదా - సాకుంగద భూపులార! ||అ||
శాంతనువనిఁ బాసిన యా - కతినాత్మనిఁగని మీరెటు?
చింతయుసిగ్గునువిడితిరె - స్వాంతమునఁ గృతఘ్నులార! ||అ||

అయ్యో! సుగ్రీవా!

ఉ|| తెలుపఁగదయ్య! వేగ నుద ; తిమణి దొంగిలినట్టి క్రూర హే
కాలదిబలంబు వాఁడొ? కపిప్రకుంజర! నాతరమానె! గూల్ప

సుగ్రీ: నీ

కాలదికిమీరునద్ది ? నృప ; కుంజర! వీరవరుండవైన నీ
వలిగినఁగూలఁడే? దనుజరాజ సమూలముగా తృణంబులోఁ.

రాఘవేంద్రా! మీ లంకను నూఱడిల్లుడు, రావణునకై వెఱువ నక్కఱలేదు. వాని బలాబలంబులు నేను బాగుగా నెఱుంగను గాని, మెట్టిన నాచూపిన కొలంది నీకు సాయంబొనర్చి దానవ నాశంబొనర్చి జానకీ దేవినిఁ దమ కర్పింపఁ గలవాఁడఁగాని, సమగ్ర బలశాలి, మాయన్నయగు వాలి. వీనివలని భయంబు తీరుదనుక, నేనీ ఋశ్యమూకంబుం బాసి చననోవ దీనుండ ననాథుండ నైన నాకు నీవే, శరణ్యంబు గాన, వాలింగూలనేసినఁ దక్కంగల పను లన్నియు నెఱవేఱును.

రాము: సుగ్రీవా! నీవింత వేడికొన నక్కఱలేదు. రాముఁ డేనాడును ఆడి తప్పువాఁడుగాఁడు. శరణనినవానిని వీడువాఁడుం గాఁడు.

మ|| అనుజాతుండను ప్రేమవీడి కలుషా ; యత్తైక చిత్తంబుతో
ఘనమోహాంధత క్రీసతింగొనియు నిర్గాసింబడం జేసి యి
ట్లనయంబుం బొలియింపఁ జూచుచదునే ; నాజింబడం గూల్చెదన్!
మనమందు న్వల వంతఁబాయుమిఁక నా ; మాటల్ నిజంబే చుమీ!

సుగ్రీ: రఘువీరా! వాలినిఁ గూలనేయుట, సులభం బనితలంపకుడు. బలశాలియు, దేవేంద్ర దత్తవర గర్వశాలియు, నిరంతర సేవిత

శూలియు నగు వాలి సామాన్యుఁడు గాఁడు, దేవదత్త ప్రకాశమణి మాలచే మెఱయుచుఁ గదనంబున నెదురఁ గదియు వాలి నీఁజదుముట కెవ్వరు నోపరు. దృష్టిమాత్రంబుననే, సంగరంబున శత్రుబలం బర్ధంబు నతండు గ్రహింపం గలఁడు, ఇది యంతయుఁ విచారించి వాలిసంహారంబునకుం బూనుము.

లక్ష్మ: సుగ్రీవా! యేమంటివి?

తే॥ గీ॥ తాటకేయులఁ గూల్చిన దండిమగని
భీమచాపము విఱిచిన భీమబలుని
ఖరవిరాధులఁ గూల్చిన ఘనభుజాఢ్యు
నెంత నావాలి నొకపెద్దఁ జేతువయ్య?

సుగ్రీ: రామానుజా! వానిబలంబు, పూర్తిగ నెఱింగినవాఁడంగాన, నిజంబు వక్కాణించితిని. కులగిరులచే నచ్చనగాయలాడును. ప్రతిదినంబును సూర్యుండుదయింపకమున్నే సాగరంబులన్నింటియందును స్నానంబొనర్చివచ్చును. దుందుభిని రణంబునం దునిమి, వానికళేబరంబు నవ్వత్తుగ నత్తి యోజనదూరంబు విసరివైచినాఁడు. నేటికి నిచ్చట నారక్కసుని యెముకలగూడుగలదు. దాని నామడ దూరంబు మీటివేయంగలఁడేని యీరామభద్రుఁడు, భద్రబలుండని నమ్మువాఁడ. సప్తసాలంబులు, నొక్కొక్కకోల, నొక్కొక్కటిఁ బడవేసినచో నింకఁ బరీక్షింపఁగోరను.

రాము: సుగ్రీవా! అట్లే నీ సందియంబుం బాపెద.

ఆ॥ వె॥ వాలికేల విసరు భారపుదుందుభిఁ
గాల మీటువాఁడఁ గాంచుమిదిగో!
సాల సప్తక మొక కోలఁ గూల్చెదనిదే,
వాలి పడునో? పడఁడో? కోలనొకట.

రాము: (కాలితోఁదన్నుచున్నాఁడు) తెరలో (దుందుభి కళేబరము పడి పెద్ద చప్పుడు)

రాము: తెరలోనికి ములికి విడుచును.

(తెరలో) (పెళపెళయను చెట్లు విరిగిపడిన చప్పుడు)

సుగ్రీ: ధన్యోస్మి. ధన్యోస్మి. రామప్రభూ! నిన్నుఁ బరీక్షింపఁగోరినందుకు క్షమింపుము, ఇవే వందన శతంబులు. (నేలకు వంగి) రాముని పాదంబులంటి నమస్కరించి లేచును.

(వానరులందరు) జయము జయము. కీర్తన, అందరు కలిసిపాడుదురు.

ఆనంద, మానంద,- మానందమాయె -

అంబుదచ్ఛవిసమ _ శ్యామశరీరా, - నతమందారా! ||ఆ||

సత్యభాష, ధర్మపోష!- సంయమీంద్రతోషా !

నిత్యధర్మరత్న భూష - నిరతవినయవేషా ||ఆ||

గౌతమ పతిశాపహరణ!- కంజమిత్ర పుత్రభరణ

పితృవాక్యపాలనభవ! - స్తోత్రపాత్ర సుగుణా! ||ఆ||

రాము: సుగ్రీవా! ఆలసింపక లెమ్మిక, వాలిని కదనంబునకుం బిల్వుము. వానితోడఁ బోరుచుండుము, నేనుసన్నద్ధుఁడనై వెంటనే వచ్చెద. వాలింగూల్చెద. కిష్కింధ దరికింబోదము పద,

సుగ్రీ: చిత్తము, అందరు నిష్క్రమింతురు.

(కిష్కింధా పర్వత ప్రాంతము)

(వాలి సుగ్రీవులు యుద్ధము చేయుచుందురు) రామలక్ష్మణ హనుమదాదులు ప్రవేశము (దూరమున నిల్చియుందురు.)

సుగ్రీ: ఆరే! భ్రాతృద్రోహీ! దుర్మార్గా! ఎంతకాలం బిట్లు మదాంధుఁడవై, విర్రవీగెదవు, కాచికొమ్మిక, కాలమందిరద్వారంబు నీకై తెఱచియున్నది. (వాలిని ముష్టింజఱచును)

వాలి: ఏరా! నీచాత్మా! నేటికి ఘనబలుండవైతివా? నన్నెదిరి పోరం గల, మహాశూరునివలెఁ బ్రేలెదు (సుగ్రీవుని పిడికిట ంబొడుచును. సుగ్రీవుఁడు పారిపోవును)

వాలి: ఛీ నీచా! బ్రతికితివి నేటికి, పారుపోతా! పోపొమ్మిక!

(వాలి నిష్క్రమించును తెరపడును).

ఋశ్యమూక పర్వతము, సుగ్రీవుఁడు వగర్చుచు, దిక్కులు చూచుచు, నిలిచి యుండును. రామాదులు సుగ్రీవుని కడకు వత్తురు.

సుగ్రీ: రామచంద్రా! నమ్మించి యెంత మోసపుచ్చితివయ్యా! నాపై

నీకునా ఇంత పగయేమిటికి? చేతఁగాదని తొలుతనే యేల తెలుపఁ గూడదు? నీ చెలిమి చాలు.

గీ॥ ఏమిదయ? రామ! యిది నను   నేటికయ్య?
యతని పైఁబంపి కొండంత   యాసగొల్పి
చేయవైతివి గోరంత   సాయమైన
చూచుచుంటివే యూరక   శూరవర్య!

గీ॥ దోసమాయెను నినునమ్మి   మోసపోతి
నాసలన్నియు నేలపాలాయె నకట!
ప్రాణములు పోవ నదియేమి   పౌరుషంబొ?
యూరకుంటివి రక్షింప   నేరకకట!

చాలు చాలు! ఇంకనిన్ను నమ్మి చెడువాఁడెవఁడు? (వగర్చుచున్నాఁడు.)

రాము: (సుగ్రీవుని మేను నిమురుచు) మిత్రమా! క్షమింపుము, నిన్ను నమ్మించి మోసముచే భంగపుచ్చుటకు మిత్రద్రోహినిగాను జుమా:

గీ॥ నీకు వాలికి భేదంబు   నేర్పరింప
నేరక కలంబకమువైన   నేరనైతి
నన్నదమ్ములు నొకపోలి   నున్నవార
లేర్పరింపుము గురుతు నీ   కెద్దియేని?

సుగ్రీ: దేవా! క్షమింపుము. ఈ తూరి, నిశ్చయముగా వాలింగూలనేతువా!

రాము: మిత్రమా! సత్యముగా, భయంబువీడి, వాలి నాచే సహతుండయ్యెనని తలంపుము, లక్ష్మణా! అవిరబూచియున్న గజపుష్పలతిక నీ సుగ్రీవుని మెడలోనుంచుము.

లక్ష్మ: చిత్తము, (లక్ష్మణుఁడట్లుచేయును.)

రాము: సుగ్రీవా! నీవు మరల వానిని సమరంబునకుం బిలువుము, తప్పక వానిం బరిమార్చెదను.

సుగ్రీ: రామప్రభూ! నిశ్చయమే?

రాము: ముమ్మాటికి నిశ్చయము.

సుగ్రీ: (ముందుకువడచి, సింహనాదము చేయును.)

వాలి: (ప్రవేశించి) లజ్జావిహీనా! పారిపోయి, మఱలవచ్చితివా? రమ్ము, కాచికొమ్ము.

సుగ్రీ: ద్రోహీ! నిలు.

(పంచచామరము)

అరేదురాత్మ! వజ్రతుల్య-మైన ముష్టిఘాతచే
బిరాన నిన్నునర్చువాఁడఁ - బేర్తిలోకవాసిగన్
బురాకృశుద్రిలడమనఁ - జోరగీటడంచెదన్
ధరేంద్రతుల్య కాయమింక - ధాత్రిపైన దొర్లగన్.

(వాలి సుగ్రీవులుపోరుచుందురు వాలినేలపైఁబడి మూర్ఛిల్లును)

(రామలక్ష్మణులు, తక్కిన వానరులునువచ్చివాలి యొద్ద నిలుతురు)

(వాలి తెలివినంది, రామునివంకఁ జూచుచు.)

వాలి: రామా!

ఉ॥ పంకజమిత్రవంశమునఁ ౖ బంక్తిరథేశుని కాత్మజుండవై
యొంకమువీఱ సత్యమె సుౖ భూషణమై వెలుఁగొందువాఁడవే?
శంకయొకింతలేకిటులు ౖ చాటుననుండి శరంబువైచి యీ
వంక మహాపరాధము న ౖ వజ్ఞయొనర్చితి వేమొ? చెల్పుమా!

రాము: వానరేంద్రా! యేమంటివి?

గీ॥ చేరిచాటున నినుఁగూల్పఁ ౖ జెల్లదంటి
వనుజభార్యనుచేపట్టి య ౖ నుజుఁద్రోలి
నట్టి దుష్టాత్మునిన్ను న ౖ ష్టినదండ
నంబొనర్చుటె రాజధ ౖ ర్మంబుచూవె!

గీ॥ కాకయుండిన నీవు శా ౖ ఖామృగమవు
గాన మాటున నిల్చి పో ౖ కార్పనగును
రాజులకు వేటదగు దీన ౖ రక్షణంబు
దుష్టశిక్షణ ధర్మమై ౖ దోచుఁ గాదె?

వాలి: రఘునందనా! సత్యసత్యప్రతుండగు, దశరథుని సుతుండవై

యిట్లు అధర్మయుద్ధం బొనర్చి, పరునితోఁ బోరాడుచున్న నన్నుఁ జాటున నిల్చి కూల్చితివి, నాయెదురఁగదిసి కదనం బొనర్చితివా ?

రాము: వానరాధిపా! సరియే, నీవు నీజాతి కంతయు నధిపుఁడవుగదా!

గీ॥ దీనరక్షణకొఱకె ధా ॥ త్రీతలంబు
నేలవలె రాజు స్వసుఖంబు ॥ నెంచియిట్లు
దుర్వ్యసనమతి దీనులఁ ॥ ద్రొక్కనగునె?
"పాలకై పాదుగునుగోయు ॥ పాపమతివి"
"కంచెయే చేనుమేసిన ॥ గలదె దిక్కు ?"

వాలి: రామా! ధర్మజ్ఞుండవు గనుకనే సుగ్రీవుని సహాయంబున కాశించి నన్ను వధించుటకిట్టి యకార్యంబొనర్చితివి. నీయుదంతంబు నావంతయైన నాకెఱింగించినచో నారావణునింగట్టి నీ పాదంబులకడం బెట్టనే? ధరాతనయందెచ్చి నీకర్పింపనే?

రాము: ఇంద్రనందనా! నీసాయంబు గోర లేదనుచుంటివా ?

గీ॥ దీనపరిపాలనంబు నా ॥ దీక్షగాని
దుష్ట బలసహాయంబొల్ల ॥ దుష్టచరిత!
దుష్టబలవంతుఁగొనియాడి ॥ తోడుకొనుట
మహినిఁబౌరుషశాలి ధ ॥ ర్మంబె? తలఁచు.

వాలి: రామభద్రా! నాబలపౌరుషంబు లెఱుంగక యిట్లుపలుకుచుంటివి.

రాము: వానరోత్తమా !

క॥ బలశాలిననుచు నీవిధి
బలహీనునిఁ దమ్మునిట్లు ॥ బాధించితివా
కలదా? వీనికి దిక్కని
కలదో? మఱి లేదో? నీవె ॥ గంటివిగాదే!

బాహుబలశాలివగు వాలీ! నీవు ధర్మహీనుండవు. సోదరుఁడు జీవించియుండఁగా నతని భార్యను నీవపహరించి కామపరతంత్రుఁడవై దురితంబునకుఁ బాల్పడితివి. గాన నిన్ను అధర్మంబుననుండి తొలంగించుటకై దండింపవలసి వచ్చితినిగాని నీతమ్ముని సహాయంబు నపేక్షించి యిట్లొనర్చితినని యెంచకుము.

వాలి: (చేతులు జోడించి) స్వామీ! క్షమింపుము.

ఉ॥ పాదరజంబునం దవని గ్రావను బ్రోచిన యోమహాత్మ! ని
న్నేదిరియు తూలనాడితి మహీశ్వర! హీనుఁడనయ్య! జ్ఞాన భా
నూదయమాయె, మోహతిమి రోద్ధతి వాసె శరంబునూడ్చి యీ
వేదనఁ బాపవే? యతుల విక్రమ! నీదయ నన్ను నేలవే?

మహాత్మా! రామభద్రా! మరణంబునకుఁ జింతింపను. నాపాపంబులకై వగచెద. నిదియుంగాక అనాథుండగు నంగదుని నీచే విడుచున్నవాఁడ. లక్ష్మణ సుగ్రీవుల మన్నించునట్లే యీ పసివానిం గూడ నేలుదువని ప్రార్థించుచున్నాఁడ.

రాము: వానరాధిపా! వీరసమరంబొనర్చి వీరమరణంబొందిన నీకు వీరలోకంబులే గల్గును. మఱియు

గీ॥ పాపఫలముగ శిక్షింపఁబడితి వీవు
పుణ్యలోకంబుగాంతు వగణ్యమతిని
చింతవీడుమ యంగదు సేమమఱయు
భారమంతయు నాయది బాసఁజేతు.

రాము: ఇదిగో! నీయురంబున నాటిన నా శరంబుం దీయుచున్నాఁడను.

వాలి: రామచంద్రా! నా ప్రాణంబులు, నిలువంజాలవు, కన్నులు తిరుగుచున్నవి. స్వరము హీనమగుచున్నది, నీ కృపచే మోక్ష సామ్రాజ్యలక్ష్మింబొందెద. (రామునకు నమస్కరించి ప్రాణములు విడుచును)

సుగ్రీ: హా! వానరోత్తమా! వీరశేఖరా! మన వైరంబు తుదకిట్లైనది. (రామునకు నమస్కరించి) రామప్రభూ! నీకు వందనములు. నీవు చేసిన ప్రతిజ్ఞ నెఱవేర్చితివి, కాని నాకిపుడీక జీవితముపై నిచ్ఛ లేదు. రాజ్యసుఖములపై నాసలేదు. సోదరహంతకుఁడనై, పాపంబున కొడిగట్టితిని. అట్టి, మేటివీరుఁడగ్రజుఁడు నశింప నేనేమిచేయం గలవాఁడఁ గాన రామమూర్తీ!

క॥ శాసింపు కీశ రాజ్యం
బోసజ్జనలోకపాల! యుండెద నేనీ

దాసుడనై సతము సుమీ
త్రాసుతువలె నన్నునేలు రాజీవాక్షా!

రాము: చా.. చాలు సుగ్రీవా! యేమందువు?

కీరవ - కన్నడ

రాము:
ఎంతవింతయు టాడితి-వేమనందు? సుగ్రీవా! -
చింతమదిన్ వీడుమునా - చెప్పినరీతినొనర్పుము. ॥ఎం॥

సుగ్రీ:
ఇందుమా ఖనిగోల్పడిమీ - రిటుగుందుచునుండమదిన్ -
బొందుగ రాజ్య సుఖంబులఁ - బొందగ నే మందుఁడనే? ॥ఇం॥

రాము:
అనురక్తినియువరాజుగ - నంగదునిల్పుము నీవును -
ఘనరాజ్యసుఖంబుల నికఁ - గాంచుమికష్టముదీరను. ॥ఎం॥

సుగ్రీ: రామప్రభూ! తమయాజ్ఞ నాకు శిరోధార్యముగదా! తమరుమా పురంబునకు దయచేసి చేయందగుకార్యంబుల ననుగ్రహింపవలెనని ప్రార్థింతును.

రాము: సుగ్రీవా! జనకునాజ్ఞ ననుసరించి, పదునాలుగేడులు, నీ వన వాసవ్రతంబు పొంగంబుగ నిర్వర్తించిగాని, నగరంబులు, జన పదబులుం జొరనొల్లంగాన లక్ష్మణుండు నీతో నరుదెంచి, సర్వ కార్యంబులు నెఱవేర్పంగలఁడు. లక్ష్మణా! నీవు, సుగ్రీవునితోఁజని వాలికిఁ బ్రేతకార్యంబులు నిర్వర్తించి, యాతనిఁ బట్టాభిషిక్తుంజేసి రమ్మా.

సుగ్రీ: దేవా! నాకేమి యానతి? సీతాన్వేషణంబొనర్పుటకై, వర్షా కాలబుగడఁజనిన పిమ్మటనైనచో, బాగుగానుండునని నాతలంపు, తమ చిత్తమెట్లో? శలవిందు,

రాము: అట్లే కానిమ్ము, పోయిరమ్ము. (అందరు నిష్క్రమింతురు)

ద్వితీయాంకము సమాప్తము.

---




(తృతీయాంకము)

---

(ఉద్యానవనము)

(సుగ్రీవుఁడు, తార-"రుమ" ప్రవేశము)

(వనవిహార మొనర్చుచుఁ బువ్వులు గోయుచుందురు)

కీర్తన

సుగ్రీ:
ప్రసూనగంధులార! యీ-ప్రసూనరాజిగంటిరే? -
ప్రశస్తమౌ సువాసనల్ - ప్రసారమందె దిక్కులన్

తార:
హృదీశ! మందమారుతుం డు - దారశీలి సూనముల్
గదల్చి తావులు గ్రహింపఁ-గా బరిభ్రమించుఁజూ

రుమ: ముదంబుతోడ నాసవంబు - మూరుకొంచుఁగ్రోలె ష-
ట్పదంబు ఝుమ్మటంచుమించి - పాడుచుండె సొంపుగా

(హనుమంతుఁడు ప్రవేశించి) ఈ వానరేంద్రుండు నిరంతర కామలోలతచేఁ గాంతలతో విహరించుచు నాసవపానమత్తుండై తనకు ముఖ్యకర్తవ్యమగు రామకార్యంబు మఱచినాఁడు. అమ్మహాత్ముం డొనర్చిన మేలు తనకు మఱువఁదగినదియేనా? యిప్పుడితనికి హెచ్చరికఁ జేయు టావశ్యకము (ముందునకువచ్చి నమస్కరించి) వానరేంద్రా! భానుపుత్త్రా! వర్షాకాలంబుదీరె వానలు కడముట్టె. గగనంబు స్వచ్ఛంబై స్వచ్ఛహృదయులగు సత్యవంతుల కీర్తివలెఁ బ్రకాశించుచున్నది. నీవు రామునకు, నొనర్చిన వాగ్దత్తంబుఁ జెల్లించికొను సమయం బేతెంచినది. రామభద్రునకు

నీ సాయంబు లేకున్నను ఆ మహానీయుని కార్యంబులు ఆయన కోదండంబే, నెఱవేర్పంగలదు, సూర్యపుత్త్రిందు, కృతఘ్నుం డనిపించుకొనుట, నీబోటిసర్వజ్ఞునకుండదగునా? యోచింపుము. రామునకు సన్నంపుటలుక పొడమకమున్నె రామానుజుని భ్రూలత ముడివడకముందె నీచెప్పినచొప్పున, సీతాన్వేషణం బొనర్చుటకై, తగు వానరవీరులంబంచుట యుక్తంబుగదా! నీపనులన్ని యుందీరినవి, మిత్త్రికార్యంబే మిగిలినది.

సుగ్రీ: మారుతీ! వేగంబ, తగు కీశనాయకుల, సమస్తదిశలంగల వనంబుల నగంబులం గల ప్లవంగబలంబులంగొని రమ్మనిపంపుము, మదీయాజ్ఞాతిక్రమణం బొనర్చువా రింక ధరిత్రి నిలువనోపరని యెఱుంగం బలికి సత్వరముగొని రండని యాజ్ఞాపింపుము.

హను: చిత్తము (పోవును) కొందరు కోతులు భయముతోc గిచకిచలాడుచు (గుంపులై త త్తరముతోc బ్రవేశము)

(తెరలో) రోషభీషణధ్వనితో (ఎవరురా? వానరులారా! సత్యభంగశీలియును గృతఘ్నుండును, మిత్త్రవంచకుండునునగు, మీరాజెక్కడనున్నాడు? రామాజ్ఞ నూని లక్ష్మణుండే తెంచెనని, తెల్పుడు.

కోతులు: ఏమిరో!యీరాచాయనకు మనరాజుగారిమీద, బలేకోపము వచ్చినది,వచ్చినదిరాముcడై నcగాదురా!శాంతింపcజేయుటకు,ఆయన తమ్ముcడురా, యీమాటేమిగానున్నదోరా? (భయముతో నిటునటు పరువులెత్తుదురు.)

(అంగదుcడు ప్రవేశించి, నమస్కరించి) తండ్రీ! తమ దర్శనమునకై ద్వారంబున, రోషభీషణాకారంబుతో, భ్రూకుటిల కుటిలంబగు ముఖంబుతో, ధనుర్ధరుండై, "క్రుద్ధసర్పంబువలె" రోజుచు లక్ష్మణుండు వేచియున్నాcడు, రామాజ్ఞనూని వచ్చినాcడు, కోపపరీతమానసుండగు, రామానుజుని,సానునయ వాక్యంబులం బలుకరించి, తమతో నెఱింగించివత్తునని,వచ్చినాcడ, తమ చిత్తముచొప్పున నొనర్చెదు, (వానరులెల్లరు నలజడినొందు చున్నారు)

సుగ్రీవుcడు: (తొట్రుపాటుతో) మిత్త్రరత్నంబట కోపమూని రా నేటికి?

కోపంబునకుఁ గారణంబేమి? నేనేమి, తప్పిదంబొనర్చితిని? (ఏమి యుపాయము)

తార: కారణము వేరుగా నడుగవలయునా? నీవు ఇంతదనుక ను మిత్రకార్యంబు నెఱవేర్పజతనంబు సేయవైతివి, రాముని మరల నొక్కమారైన నేఁగి సందర్శింపవైతివి, కోపకారణంబు తెలియదా? అభిజాత్య సంపన్నుండగు నుత్తమరాజ వీర పుత్రుండుగదా! స్త్రీల మానుషంబుం గాపాడుటకై గరాగరిలోనికిం జొఱరాక, వెలుపలనే నిలిచియున్నవాఁడు, ఆయనం గని భక్తితో గారవింపఁబొమ్ము. లెమ్ము లోనికిం దోడితెమ్ము, అమ్మహాపురుషుండు మాటకఱకైనను మనసు మెత్తనగలవాఁడు.

సుగ్రీ: తారా! నీవేగి మహాత్ముండును, సత్యవ్రతుండునునగు నాతని కోపంబుడిపి లోనికిం దోడితెమ్ము.

తార: చిత్తము: ఆయన ఆపదలోనున్నవాఁడగుట; కోపంబున నేమేని దురుసుగా మాటాడినను; నీవు శాంతుఁడవై; ప్రశాంతవాక్యంబుల నమ్మహాత్ము ననునయింపుము. ముందు కార్యంబు నాలోచించుము. (తారపోయి; మఱల లక్ష్మణునితోఁ బ్రవేశించును.)

సుగ్రీ: (తత్తరముతో; లేచి నిలిచి, నమస్కరించును) స్త్రీలు ఎడముగ నిలుతురు,

లక్ష్మ: (స్త్రీలవైపుఁ జూడక పెడముఖముగా నిలిచి,) సుగ్రీవునిఁగోప దృష్టిం జూచుచు వింటికొన నేలపైనాని, తలవంకించుచు,

గీ॥ వానరాధమ! సత్యవిహీనచిత్త!
నీదు కుటిలంబెఱుంగదు x నిర్మలుండు,
రామచంద్రుండు సత్యప x రాక్రముండు
మత్తుఁడవు రామకార్యంబె x మఱచినావు.

గీ॥ నీవు దీనుఁడవై వేడ x నిరుపమాన
కరుణ నినుఁ బ్రోచె వాలిని x గండడంచి
కామసుఖలోలమతి మిత్ర x కార్యమెల్ల
మఱచితివి కృతఘ్నుఁడ ద్రోహ x మతివిగాదె?

కీ ర్త న

ఓరీ! వానరుండ!- కూ్రరమానసుండ-
నారీజనులఁ గూడి-యీరీతిమఱువ నానే ||ఓరీ||

చాలుచాలునీదు - కూళతనము నాదు
కోలఁగూలనేయఁ - జాలనె? యేమాయె ||ఓరీ||

పందవౌచు వాలికోడి - పారిపోయి రాముచేడి -
పొందినావీ సుఖంబు- లెందునుగమనించవే ||ఓరీ||

అగ్రజుండు; సత్యమూర్తి - అతిదయానువర్తిదా -
నాజ్ఞ నీయడాయె ని-న్నంతకుపురిఁ జేర్పఁగా|| ఓరీ||

వాలిఁ గూలనేసినట్టి - కోలమొక్క-వోదులే?-
వాలిపోవుమార్గమునకె - వాంఛఁజేసినావులే! ||ఓరీ||

తార: కుమారా! రామానుజా! వానరేంద్రుండు, కృతఘ్నుండును, మిత్రద్రోహియుంగాదు, నీ విట్లు నిందింపందగిన నీచుండునుంగాదు, రామదయారసంబుచే, నేటికిఁ గష్టంబులెల్లఁదీఱి, సుఖంబులం గాంచినవాఁడగుటచే, "రామునిఁ గరుణానిధి యని యెఱింగినవాఁ" డగుటచే, రామమూర్తి యెడంగల చనవుచేఁ సుఖలోలుండైన మాటసత్యమే. గాని, మీ మేలెన్నడును, మఱచిన వాఁడుగాఁడు, నిరంతరమును స్మరించుచునే యుండును, అయినను, మిత్రుని నేరమిని, మీబోంటి మహాత్ములకు, సైరింపరానిదా?

లక్ష్మ: ఔనమ్మా! యిట్టి యాపదలోఁ గలిగిన, యీ విషమస్థితికి, మేము చేయవలసిన కార్యమేమో? దెల్పుము.

సుగ్రీ: (ముందుకువచ్చి) రామానుజా! మిత్రరత్నమా! దీనుఁడనగు నానేరమిని క్షమించుము, పొరఁబాటుననో, చాపల్యముననో, స్వతంత్రముననో,సోదరుఁడు తప్పులుచేసిన సోదరులు సహింపకున్న నెట్లు? దశదిశలంగల వానరులం బిలువంబంచితి, నేడే వారందరు నేతెంతురు. సేనలులేక మనమేపనిం జేయుటకు వలనుగాదుగదా! సర్వవానరబలంబులం దోడుకొని,నా స్వామియగు,రామచంద్రునిం జూడ రా నెంచుచున్నాఁడ.

లక్ష్మ: సుగ్రీవా! నీయత్నంబెఱుంగక, నిన్ను దూషించితిని, వేరుగా నెన్నకుము. ఈరీతిని, నిజంబొప్పికొనుట నీకును, రామునకుం, దప్పు నేరికింగలదు? రామునకుందగిన,మిత్త్రుండవే నీవు,మనరాకకై యెదురుఁజూచుచు,సీతా వియోగ వ్యథితమానసుండై,యగ్రజుండు, తపించుచుండుం గాన, మనము త్వరగా నమ్మహాత్ముని జూడఁ బోవుదము.

సుగ్రీ: (చిత్తము) తారా! మీ రంతిపురికింబొండు. మేము రామమూర్తింగనఁ బోవుదుము.

తార: చిత్తము. (పోవుదురు) (సుగ్రీవాదులుఅందరు నిష్క్రమింతురు.)

ప్రవర్షణగిరి ప్రాంతము: అరణ్యము, వృక్షచ్ఛాయ.

(రాముఁడు ప్రవేశము.)

రాము: సీతా!

సీ॥ పలుమారు నీహస్త ॥ పల్లవంబులచేత
నంటి నా మైతాప ॥ మార్ప వేల?
నలినాక్షి! పరిరంభ ॥ ణ క్రీడఁదేల్చి నా
మది దుఃఖభర మింక ॥ మాన్ప వేల?
చెలి! యధరామృత ॥ సేవచే నీవలఁ
వడి వీడి నా దప్పి ॥ నుడుప వేల?
తన్వి! నామదిఁబరి ॥ తాపంబెడలఁ దేనెఁ
జిలుకుచు నాతోడఁ ॥ బల్కవేల?
ఆ॥ వె॥ జలజ మృదులపాణి! ॥ చంపక సమగంధి!
అధరవిజితబింబ! ॥ మధురవాణి!
దిక్కు లేనివాఁడ ॥ దీనుఁడ నన్నిట్లుఁ
బాసిపోవనేమి ॥ చేసినాఁడ?

(ఇటునట చూచి యాలకించి)

ఏమిది? సముద్ర ఘోషంబునుమించు, నీ ధ్వనియేమి? రవిమండలంబు నాక్రమించు, నీ పెంధూళియేమి? (దృష్టిసారించి) ఓహో! ప్లవంగ బలములఁ దోడ్కొని, లక్ష్మణ సుగ్రీవులు, వచ్చుచున్నట్లున్నారు.

(లక్ష్మణ సుగ్రీవులు ప్రవేశించి రామునకు నమస్కరింతురు)

(సుగ్రీవుఁడు లక్ష్మణుని వెనుకగా నిలిచియుండును)

లక్ష్మ: అన్నా! రఘూత్తమా! యీ వానర నేతయగు సుగ్రీవుఁడు, జానకీదేవిని వెదకుటకై, ప్లవంగమ వీరులం దోడ్కొనివచ్చినాఁడు, తమ కార్యంబు నించుక తడవుగ, నాచరించినందుకు, లజ్జా భయంబు లావరింప శంకించుచున్నాఁడు, దయజూడుడు.

రాము: వానరేంద్రా! యిటురమ్ము, నీవంటి మిత్ర రత్నము గలిగి యుండ; మాకుఁ గొరంతగలదా?

సుగ్రీ: (ముందునకు వచ్చి నమస్కరించి) రఘువీరమణీ! తమ యాజ్ఞకై వేచియున్నవాఁడ;

రాము: మిత్రమా! యిటఁగూర్చుండుము (చేయిఁబట్టి తనచేఁతువను గూర్చుండఁ జేయును)

సుగ్రీ: ప్రభూ! అదియే వానరబలంబు, ఈ వానర వీరకోటి యంతయు, నీయాజ్ఞాబద్ధంబు. వీరెల్లరు రామకార్య నిర్వాహణం బొనర్ప సంసిద్ధులగు, నీకునై ప్రాణంబులనైన, సర్పింపఁగలరు. వీరెల్లరిచేఁ బనులుగొనుము వీరు నీవారు, నేను నీవాఁడ, నీ చిత్తము తెలుఁగున నాచరింపుము, మేటి వీరులగు, హనుమ దాదులు, తమ, ముదలకై యెదురుఁ జూచుచున్నారు, అదిగో! యూథప, యూథులగు, వానరనాథులందోడ్కొని, అంగద హనుమదాదుల వచ్చుచున్నారు.

(కొందరు వానరులతో, హనుమదాదులు ప్రవేశము) అందరు, రామునకు నమస్కరించి, (పాడుదురు)

కీర్తన

శరణు శరణు దా - శరథే! దయా! శరథే! _ సుగుణ మణినిధే! ॥శ॥

శరణు శరణు రఘు-వంశసుధాంబుధి - చంద్రమ! విమలయశ
సాంద్రమనీ

చరణదాసులము మా వలనను నిట-సరగునఁబనులను - గొనుము
ముదలనిడి ॥శ॥

క్రూరదానవుల - బీరమడచిమా _ వీరశూరబల - విక్రమధైర్యో -
దారత వెలయగ-నీమది మెచ్చఁగ, ధారుణిసుతఁగని - తగనే తెంతుము

రాము: సంతోషము. మీరందరును గూర్చుండుడు (అందరు గూర్చుందురు)

రాము: రవినందనా! నీయుపకృతికిం గడు, సంతసించితిని. నేల యీనినట్లున్న యీ నీ సేనలో నేర్పరులగు వారి నేర్పరించి, నాల్గు దిక్కులకుఁ బంపవలెను, అందు దక్షిణంబునకు హనుమదాదుల నంపవలెను.

సుగ్రీవు: చిత్తము.

రాము: హనుమంతా! వినుము. ధీమంతుండవు బలశౌర్య వీర్యధైర్య సాహసవంతుండవు, నీ జనకుండగు పవమానునకు సముఁడవు, నీ వొక్కరుండవే, మా కార్యసాఫల్యం బొనరింప, సమర్థుండవని యెంచెద, నీవు సీతం గాంచి మా సేమం బెఱింగించి, యామె సేమంబు నడుగుము, మా సేమంబు నామె కెఱింగించు నప్పుడే జాగరూకుండవై యోచించి మాటాడవలె నేమనఁగా?

గీ. "తప్తమగు ముత్య మాజలశుక్తి ప్తమైన
మౌక్తిక మగునట్లు" ధారుణీ సుతఁ దలంప
మదిని జిరకాలమున నుండి మమ్ముఁ బాసి
తగని విరహాగ్నికీలలఁ దప్తయగుట.

గీ. నేడు నీచే హితాత్తుగా, నెలత తనదు
ప్రియుఁడనగు నాదు సేమంబు వినుటవలన
ముగుద కోమలహృదయంబు ప్రిదిలిపోవ
సంతసము మితిమించిన సమయ మేమి?

కాన, సమయోచిత వాఙ్నైపుణి మెఱయ, భాషింపుము, నీకు నాకొటులు, నేర్పులు గఱపవలెనా? సీతతో నామాటలుగా నిట్లనుము.

సీ. నిన్నుఁ బాసినదాది నన్నదమ్ములు వెసఁ
గన్ను మూయరు పన్నుఁ గదుపరనుము
కన్నీరు నేరులై గతిఁ బారనవ్వేళ
నెడలేక తుడుచుట నెఱుగరనుము

అసువులు వీడఁగ \ నాత్మనెంచియు ధృతి,
నీకు నై బ్రిదుకగా \ నెంచిరనుము
రామచంద్రుఁడురక్తి \ రామానుజుఁడుభక్తి
నియతి నీపై మదు \ ల్నిలిపిరనుము
గీ॥ కష్టములుపొందుకాలంబుఁ \ గడచె ననుము
శత్రునిర్మూలనమొనర్చి \ క్షాత్రమునను
జనకజానందకరమగు \ శపథమూని
ముద్రికనునీకొసగె రామ \ భద్రుఁడనుము.
గీ॥ నీయునికిపట్టుఁగక \ యిట్టులింత
కాలమేగెనుజేసిరి \ జాలమనుము
దుఃఖజాలంబునిన్నింక \ దొలఁగుననుము
రాముఁడు భరించె నిన్నెంచి \ ప్రాణమనుము.
(ముద్రికనిచ్చుచు)

కీర్తన

రాము :

దయగొనిచనుమా - ధరణిజఁగనుమా -
భయమువదలి సం - బ్రముఁ గనుమనుమా ॥ద॥
ముద్రికనిడితగు - గురుతును గొనుమా -
భద్రమునుమి; నా - పనుపొనరుపుమా॥ ద॥

హనుమా! మాకార్యంబు సాఫల్యంబొనర్చి జయశాలివై రమ్ము.

హను: ధన్యోస్మి; ధన్యోస్మి. దేవా! తమ యాశీర్వచనంబమోఘంబగుఁ గాత; పోయివచ్చెద.

రాము: మంచిది.

(హనుమ, రామ లక్ష్మణ సుగ్రీవులకు నమస్కరించును)
(అందరు నిష్క్రమింతురు)

(హనుమ దంగద జాంబవంతులు ప్రవేశము)

అంగ: ఋక్షవరాగ్రణీ! ఇంతదనుక సీతం గాంచనేరమైతిమి, చండ శాసనుండగు సుగ్రీవుఁ డొసంగిన గడువును, గడచెఁగదా! యేమి చేయుదము ?

జాంబ: నాకునుం దోఁచకున్నది, మారుతీ! యేమాలోచింతము? స్వామి కార్య నిర్వహణం బొనర్పక, మనముండి ప్రయోజనమేమి?

హను: బ్రహ్మపుత్రా! సాగర గర్భంబుదక్షిణభాగం బంతయును వెదకితిమి.

(తెరలో)

ఆహా! యేమి? యింతకాలమునకు నాకుఁ గడుపునిండా అశనము దొరకినది: యీ క్రోతులనన్నిటిని బట్టి భక్షించి, యీ క్షుద్బాధ నడంచెదను.

అంగ: మారుతీ! యిదేమి? యీ పక్షి యెచటిది? నేటికి మనము వీరుల మయ్యు, దీనిచేఁదీరు కాలం బేతెంచెఁగాఁబోలు. హా! యేమి? యీ సంఘ మరణము?

గీ॥ ఏలమన నిట్టి పనికంపె? నినసుతుండు
నేలపూనితి? మీపని కెల్లరమును
ఎచట వెదకినఁ గనుపడ దేల? సీత
యేల? నీ పక్షిచే మన కిట్టిచావు.

గీ. ఇట్టి వరములఁ గైక దా నేలగోరె?
నీవనికి రాము దశరథుఁ డేల పంపె?
రాముసతి నేలగొనిపోయె రావణుండు
నేలవాఁడు జటాయువు గూలనేసె.

(తెరలో: సంపాతి) అయ్యో! అయ్యలారా! యేమంటిరి? నా తమ్ముఁడగు జటాయువును, రావణుడు చంపెనా? వానిం జూచి యెంతకాలమాయె? తుదకు వాని మరణవార్త వినుటకా? నేనింత కాలము బ్రతికితిని. వానరులారా! నా తమ్ముని మరణ వార్త వివరించి తెలుపుడు.

అంగ: రాముని భార్యయగు సీతాదేవిని, నొంటిగానుండ రావణుండు, అపహరించి కొనిపోవుచుండ నామె కుయ్యిడఁగా, నాలించి జటాయు వెదిరించి పోరాడ, నా దనుజుండు నీ తమ్ముని పక్షంబులు ఛేదించి, నేలంగూల్చెను. పిదప సీతను వెదకుచు, వచ్చి

రామ లక్ష్మణులు, కొన యూపిరితో నున్న పక్షీంద్రుచే, జానకీ వృత్తాంతం బెఱింగిరి. పిదప స్వర్గస్థుండైన విహగేంద్రునకు, రాముఁడు, దహన సంస్కారంబొనరించినాఁడు.

వెనుక సుగ్రీవుఁతోఁ జెలిమిఁజేసి వాలింగూల్చినాఁడు, రామ సుగ్రీవులయాజ్ఞచే మేమందరము, జానకిజాడ లరయవచ్చితిమి, నీకేమైనం దెలియునేని దయయుంచి, తెలుపుము. ఇతఁడు, హనుమానుఁడు, అతఁడు జాంబవంతుఁడు, నేను వాలిసుతుండను.

సంపాతి: నాయనా! వినుడు, నాకెఱింగినంతవట్టు దెలిపెదను రావణుండు సీతనెత్తుకొఁబోవుచుండఁ జూచితిఁగాని పక్షహీనుండనగుట నేమియుం జేయంజాలనైతిని. వాక్సహాయంబైనఁజేతును, నూఱామడలుగల సముద్రంబు దరించినచో నచట, విశ్వకర్మనిర్మితంబగు, లంకాపురంబుదోఁచు. నందు రావణుమందిరంబుననే, దుఃఖాక్రాంతయై, సీత కష్టంబులనందుచు రాముందలంచుచుఁ దపించుచున్నది, దగ్ధపక్షుండనగునాకు, నిశాకరఋషీంద్రుఁడు వరంబొసంగె. నేమన? రామకార్యార్థులైయేతెంచు, వానరులకు, సీతయునికి, రావణోదంతంబు నెఱింగించి, రామకార్యంబున కీసహాయంబొనర్చితివయేని? నీకుఁబక్షంబులు మొలచునని యు నంతదనుక నిల్లే యుండుమనియెను. ఇవిగో! నాకు రెక్కలు మొలిచినవి. నేనింకఁబోయెదను. మీరుత్వరపడి యత్నంబొనర్చుడు. కార్యసిద్ధియగును. వాయునందనా! నీదర్శనంబుచేఁ గృతార్థుండనైతి. మీకెల్లరకు వందనంబులు. నాకు శలవొసంగుడు.

అందరు: మంచిదిపొమ్ము,

హను: మిత్రులారా! యింకనాలస్యం బేటికి? సత్వరంబున సముద్రతీరంబునకేగుదము.

అంగ: మంచిది. (అంతానిష్క్రమింతురు)

(సముద్రతీరము వానరులంతా పరిక్రమము)

హను: ఆలోచింపుచు నూరకకూర్చుండును.

కీర్తన

అంగ:

వారాశిలంఘించుడీ - వానరులారా ఈ - వారాశిలంఘించుడీ॥ వారా॥
భూసుతంగనుగొన్న - భూరియశంబు న -
భోభూములన్నిండః - గాశల్ వే బిగియింపుడీ ॥వారా॥

వానరులు: చిత్తము

అంగ: జాగూనరాదిట్లు - మీరాలసింపంగ -
కార్యంబుభంగంబగున్ - గానక బీరంబొప్ప ॥వారాశి॥

వానరులు: చిత్తము

అంగ: వారాశిలంఘించుడీ- వానరవరులార- వారాశిలంఘిచుడీ॥ వా॥

నీలు: అంగదకుమారా! శతయోజన విస్తీర్ణమగు నీసముద్రంబు నవలి తీరంబుచేర నాబోటికలవిగాదు, పదియామడలు దాటగలవాఁడను మీరేమిచేసినను సరియే (వానరు లందరు వరుసగా)

నేను. ఇరవది, నేను. ఏబది, నేను. ఎనుబది,
నేను. ముప్పది, నేను. అరువది, నేను,
నేను. నలుబది, నేను. డెబ్బది, నేను.

అంగ: (జాంబవంతునిగని విచారముతో) ఋక్షవరాగ్రణీ! నీవెంత దూరంబు దుముకంగలవు?

జాంబ: తారేయా! సిగ్గువడుచున్నాఁడ, వృద్ధుండను. స్వామి కార్య నిర్వహణసమర్థుండనుగాని, వ్యర్థుండను, మున్ను నేర్పరినన్నచో, లాభమేమి? మీకెల్ల రకు, నవ్వులాటగనుండునుగదా! యిప్పుడు మాత్రము, తొంబదామడ మాత్రమే దుముకంగలవాఁడను.

అంగ. మీ మీబలంబులు మీరుగ్గడించితిరిగదా! యిఁక నేను నూరామడ వారాశియు, లంఘింపనేర్తునుగాని,మఱలి రానేర్తునో? నేరనో? యని చింతించుచుంటిని.

జాంబ: యువరాజా! నీవు సమర్థుండవేయైనను మాకు ప్రభువగుటచే మా చేఁబనులు గొననగునుగాని; కొల్లరముండి నిన్నంపుట ధర్మం బగునా? అయినను మనమిట్లు చింతింపనేల? అసమాన బలతేజో

వంతుఁడగు హనుమంతుండుండ మనకేటికొదువ? (హనుమంతుని భుజము దట్టుచు) హనుమా! యిదేమి? మేమిట్లు దురంత చింతా వ్యథంజిక్కి తపించుచుండ, నీవేమో నీపసగాదన్నట్లు నిర్విచారం బుగనేమో యోచించుచు, నూరకకూర్చున్నాడవు!

హను. భల్లూకపతీ! ఏమీ?

'పూరి' - కీర్తన

హను: డెండమందు గుండ నేటికి?

అందరు: దాటఁటయెటు వననిధియని?

హను: నాశౌర్యంబును దెలియుడి - విశాసంకోచములనువిడి - యానందింపుడి మీమది!

అందరు: ముదంబు మాకెదఁ వినెదము.

హను: పారావారముగనుచును - మీరీలాగునవెఱువగ - తీరునె కార్యభారంబిఁక

అందరు: తరంబగునె? మాకిచట.

హను: (వీరావేశముతో విజృంభించుచు) వానరవీరులారా! వినుఁడు.

గీ॥ చేయుకార్యము రఘురాము | సేమమునకు
పుట్టినదిమహాబలునకుఁ | బట్టినగుచు
మూర్ధమునఁ దాల్చినది రామ | ముద్రికగద
జలధిలంఘించువాఁడ ని | స్సంశయముగ॥

(ఒడలుప్పొంగ, గగుర్పొడువఁగ, సంతోషముతో,

శా॥ పారావార గభీరు రాముకృపచే | వారాశిలంఘించెదన్
క్రూరుండౌ ఖలలాళిచేఁ బడిన మా | క్షోణీజఁగాంతుంగనం
గారాదేని? దశకంఠ యుక్తఘనలం | కాద్వీపముం దెచ్చెదన్
శ్రీరామాంఘ్రియుగంబు చెంతకనుర | శ్రేణుల్ వగంగుందఁగన్.

అందరును, తథాస్తు తథాస్తు, (హనుమంతుఁడు అంజలిఘటించిపాడును)

( కీ ర్త న )

పరమపురుష! భవవినాశ! - ప్రస్తుతింతునిన్ను నీ -
కరుణజలధిదాటు వాఁడఁ - గళ్యాణరాఘువేంద్ర! ||పర||

భవ్యశుభావహుఁడవీవు - భవనుతుఁడవు నాద్యుఁడవు
అవ్యయుఁడవునీవు శంక -రాభరణ తల్ప తేజ ||పర||

శరణాగతజనజీవన - బిరుదాంకుఁడవీవెనీదు -
పరమదివ్యనామంబే గడ - పగఁ జేయునుదుఃఖాంబుధి ||పర||

భువనత్రియకంటకనర - భోజనకాననభైరవ_
దవదహనసమప్రతాప - దాక్షాయణీనాథవినుత ||పర||

అన్యదైవమెఱుగనిన్నె - యాత్మనమ్మితోడివార -
లందరుగనవార్ధిదాటె - యరుగబలమునిమ్మురామా! ||పర||

ఇదె త్రికరణశుద్ధిగాఁ బ్రతినఁజేయుచున్న వాఁడ.

గీ|| నేను శ్రీరామసేవనా ॥ నిరతిరామ
కార్యపంతంత్రమతినయి ॥ కాల్చువాఁడ
నేనిఁకన్నాత యాసీత ॥ నెమకుకొఱకుఁ
గంధినవలీలదాటుదుఁ ॥ గాకనిపుడె.

జే. రామ లక్ష్మణ సుగ్రీవులకు జే. అనుచు సముద్రముదాటుచు నిష్క్రమించును (తెరజారును)

తృ తీ యా ం క ము
స మా ప్త ము




(చతుర్థాంకము)

లంకాపురదుర్గము (హనుమంతుఁడు ప్రవేశము)

హను: ఈ లంకానగరంబు మహావైభవోపేతంబై గన్పట్టుచున్నది. భయంకరరాక్షస వీరరక్షితంబగు దీనిఁజొచ్చు టెట్లు? కానిమ్ము. చేరువకేగిచూతము (ముందునకునడచి)

కీర్తన

అసామాన్య భోగంబుల - నసురతల్లజుని - పురమలరారెఁ,
హసితనాకమిది_యసురపాలితము-పసిడికుడ్యములు - వసదనరెఁ
మిసిమిగనా-కసమునకిం-పెసగముద్దు - లొనగగోపు-రాగ్రముల్,
ఈబీరుకోట - నెటగానన్ - నాతరంబా? దీనిఁదాటన్-
కొనయెదిరో_మొన -యెదిరో
కనుగొనవోపను - వేగన్ - జనకజగను టెటు - జనివెదకుట యెటు
జనకజగనకను - వెనుకకుఁజను టెటు - లినకులుగను టెటులో॥

ఆహా! యేమీ? స్వామి కార్యం బొనర్చుటకింతతడవు యోజించుచుంటినేమి! కానిమ్ము. ఈ రాత్రియే లంకంజొచ్చి జానకిని వెదకెదను (ద్వారంబుకడకుంజని లంకిణిం జూచి, యేమీ యీ వికృత స్వరూపంబు) ఇది యెవ్వరో యీ కోటవాకిట కాపుండినదిగాంబోలు.

సీ॥ బండికండెసరీతి । బైసిమాలినమేని
ఛాయతో నొప్పునీ । చానదలప
కోకబికవేసంబు । గూనిమూపులతోడఁ
గావలిగాచునీ । కాంత భళిర!
గింజలుడుల్చిన । ముంజకాయలఁబోలి
నయనంబులొప్పునీ । నాతికరయఁ
జేనెడుపొడవునఁ । జెలరేగు నెఱ్ఱని
జుంజురువెండ్రుకల్ । సుదతికలరు
గీ॥ చాలునీగోల కాలుచేఁ । గోలయేమొ
నెమ్మదింజూడ రాకాసు । లమ్మయేమొ
భయమునాశ్చర్యహాస్యసం । భ్రమములమరు
దీనిగన నన్యులు సురులు । దీటిపోర?

దీనితోనాకేమి? నేనెట్లైన నీ ప్రాకారంబునుదాటెద (ప్రాకారంబు దరికింజనును)

(లంకిణిదద్దరిల్లి యిటునటుఁ జూచి)

లంకి: ఎవఁడురా? నీవు నిలునిలు.

శా॥ ఓరీ! యెవ్వడవెట్టిసాహసమురా? । యొక్కింతభీతిల్లకే
రా! రక్షోవరుదుర్గమందుఁ జొఱనీ । ప్రాకారముందాటెదే?
ఔరా! యీపురినాదు రక్షణకులో । నైయుంటనీవెన్నవో?
చోరా! నీవిఁకనెందుఁబోఁగలవొ? యిచ్చో నిల్చిపోరాడరా,

హను: సరే నన్ను నడ్డగింపవచ్చితివి, నీ వెవ్వరవు? నీ నామమేమి? క నీకిక్కడ నొంటరిగానుంటివేమి?

లంకి: వానరా! నేనీలంకాపురాధి దేవతను, బ్రహ్మవనుపున నేనీ లంకాపుర రక్షణంబొనర్తును.

హను: ద్వారంబునడ్డగింపక తొలగుము. నన్నడ్డగింపఁగలదానవా? నీవు.

లంకి: అనేకరాక్షసవీర భటరక్షితంబగు లంకంజొచ్చుట దేవతలకే నశక్యంబు. అందు నన్నతిక్రమించిపోవ నీరితరంబుగాదు, నిన్నుఁ బ్రాణంబులతోఁ బోనిత్తునా?

హను: ఏమీ; నీతోఁ బోరాడవలెనా? ఆడుదానవని యోచించు చుంటిని.

లంకి: వానరాధమా! నీవు నాతోఁ బోరాడి, బ్రదుకంగలవాఁడవా? నిన్ను వదలుదానంగాను, ఇదే కాచికొమ్ము. (పిడికిలిబిగించి పై కెత్తును)

హను: ఓసిదానవీ! నీపిడికిలి గనిబెదరుదునా? నీప్రాణంబులు రక్షించుకొననెంచికొందువేని? నాకడ్డములెమ్ము.

కీర్తన

లంకి: వదరకు బెదరకు – నిలుప్లవగా

హను: కారు ప్రేలకు – కాలునిఁజేర్చెద

లంకి: ఏరా జంకెన – లేటికినిలురా

హను: భూరిముష్టిహతి చవి గనుమిదిగో

లంకి: ఏలా బీరము – నెదుర్కొంతువెనన్

హను: ఆలోచింపక – నలతిగఁజూడకు

లంకి: ఇదెగదిసెద నద – మదమొనరింతున్

హను: మదిచెదరక నిలు – మిదె గుదియింతున్

లంకిణి: హనుమంతుని వక్షంబున గుద్దును.

హను: లంకిణింబడఁగూల్చును.

లంకి: హనుమంతునకు నమస్కరించును.

లంకి: ఓయీ! వానరవీరా! నన్ను క్షమించుము, నేనీపురిం బాసిపోవుదాన, నీవు లోనికింబొమ్ము. లంకాపురికి నాశనసమయంబు గలిగె. బ్రహ్మశాపంబు నిశ్చితంబయ్యె. నన్ను జయించితివి. సర్వరక్షోగణంబులను జయింతువు. నేఁబోయెద (లంకిణి నిష్క్రమించును)

(లంకలో రావణుని అంతఃపురము హనుమంతుఁడుప్రవేశము)

హను: (కీర్తన)

హైమగిరీంద్రము – హసియించెదునీ – అమరవిరోధి – హర్మ్యముగంటిరే ॥
ఉన్నతికినిసం – పన్నతకునుదా – చెన్నగునింద్రుని – సౌధముసాటియె?
హరిహరియిటపై – మఱచినిద్రించెడు – తరుణులఁగంటేని – ధాత్రిజలేదయో!

అకటా మూడుజాములరాత్రి తిరిగిపోయెను. జనకతనయ జాడ లేమియు గానరావు. చేరెడుచోటునైన విడువక వెదకి వెదకి వేసారితిని. ఇంకేది యుపాయము? ఇంకనెచట వెదకుదును? ఇంకను ఎట్టిరహస్య స్థలంబున నీదుష్టుఁ డామెను దాచియుంచెడును? ఏమి చేయుదు?

ఉ॥ చొచ్చితి సురారిమందిరముఁ ౙ జుట్టిదశాస్యునిస్కంధముల్ వెసం
గచ్చితి చెలంగ వాలమునఁ ౙ గంధులముంచుచు, నెత్తి మొత్తుచుం
జెచ్చెర వాలిరీతిగనె ౙ చేసిన సీతను జూపుఁ జూపఁడేన్
పచ్చడిచేతుమూర్ధముల ౙ బాహుల వింశతిఁ ద్రెంపివైచెదన్.

అట్లుగానిచో

ఉ॥ కూల్చెదఁజూర్ణమౌనటుల ౙ గోత్రవరంబుల దోర్బలంబునం
జీల్చెదిగంతదంతులను ౙ జిందరవందరఁ జేసి వార్ధులం
బీల్చెదఁబంచభూతములఁ ౙ బిప్పియొనర్చెద నంత రాముఁడే
జెల్చనమానుమా హనుమ! ౙ భీతిత్రిలోకములంచుఁ బల్కెడున్.

(అటు నిటుఁజూచి)

ఆహా! యేమి? నా తెలివి. అంతటను వెదకితినిగాని, అదిగో! అచ్చట అశోకవనంబొకటి గానవచ్చుచున్నది. దానియందుఁగూడ వెదకెదఁగాక.

(హనుమంతుఁడు నిష్క్రమించును.)

(అశోకవనము. హనుమంతుఁడు ప్రవేశము) సీత అశోకవృక్షము క్రిందను గూర్చుని రామనామ స్మరణఁ జేయుచుండును.

హను: ఆహా! యేమీ? ఈయశోకవనంబుసొంపు, నందనచైత్రవనంబు లంగూడఁ దిరస్కరించుచున్నది. యీవనంబునందే, తప్పక, జనకరాజనందని యగు, రఘురాముని ప్రాణేశ్వరి యుండనోపు. నిందు వెదకెద: తప్పక సీతాదేవిగ [illegible]ను, సర్వదేవతలకును, నమస్కరించి, మాతండ్రియగు మా[illegible]తునకు, వందనంబులొసంగి, రామ లక్ష్మణ సుగ్రీవులకును; జా[illegible]కీ దేవికిని, నతులర్పించెద. మైథిలీదేవి, తప్పక కన్పట్టుఁగాక. (నలుదెసలు వెదకుచు),

గీ॥ రామచంద్రుఁడు సత్యప ౙ రాక్రముండు
నిత్యసత్యవ్రతుండు ని ౙ ర్నిద్రభద్ర

తేలఁ జెవ్వేళనన్నున వ్యాజకరుణఁ
బో్రచునేని?జానకియటఁ దోచుఁగాత.

(ఇటునటుఁ జూచుచు, వికసితముఖుండై, దృష్టినిల్పి)

మ॥ భళిరే! కంటినిగంటి ‹బం క్తిరథభూ పాలస్నుపారత్నమున్
జలజాప్తాన్వయరామపాదసరసీ జాతాంచితధ్యానని
స్తులభాస్వద్గుణయు క్తపూతచరితన్ శుద్ధాత్మనీ మానినీ
తిలకంబున్ దనుజాంగనావృతను ధా త్రీజాత సీతా సతిన్.

నాకష్టంబంతయు నీడేరినట్లే, యీరక్కసులు గాంచకుండ నీచెట్టుపైన డాగియుండి, తగుసమయముంగాంచి, యీమెంబల్కరించు వాఁడ. (చెట్టుపైడాగియుండును)

సీత: హా రామా! ప్రాణవల్లభా! నన్నీయాపదబ్ధినుండి, యెన్నడుద్ధరింతువో?

కీర్తన

రామా! రఘురామా! నీపద-రాజీవము లెదఁగొలుతున్
మానసముననిను-మఱువకనునయము-ప్రాణంబులుబిగ-బట్టిమెలగుదున్
క్రూరుండగుదశకంఠుండట - చోరునిగతినను దెచ్చెన్
ధీరవరుని నా దేవునిభవ్య - కారముగాంచఁ గలుగునో లేదో?

హను: (దాగియుండియే తనలో) ఆహా! నేడు నాజన్మ సఫలతం గాంచెను. నాకార్యంబులన్నియుం గట్టెక్కినట్లే. ధన్యుండ ధన్యుండ.

కీర్తన

కనులపండువు - గనుభూజాతం - గనిసఫలీకృత - కార్యుఁడనైతిని
రఘురామునినామ-మనవరతంబును-స్మరియించిన ఈ- పరమసాధ్వీమణి.

ఆహా - యేమీ! దైవచేష్టితము? ఎట్టిమహాత్ములకట్టి పాట్లు గలెను? పరమసుఖార్హాయైన యీ జానకీదేవి కీ కేనా? యిట్టి యిక్కట్లు ఘటిల్లుట.

సీ॥ నల్లదాప్రుడుమూక నల్ల చీమలరీతి
నలిపెడుభల్లూక నాధులుండ
దానవమూర్ధములన్ తాటికాయలరీతిఁ
జెండాడువానర సేనలుండ

కాలపాశముఁబట్టి ౹ లీలనూఁగెడుశూరు
లంగదసుగ్రీవు ౹ లమరియుండ
రావణహాతకుని ౹ లావు దుల్చిన వాలిఁ
గూలనేసిన రాము ౹ కోలయుండ.
గీ॥ బాపురే లక్ష్మణుని మేనఁ ౹ బ్రాణముండ
నాంజనేయుని బొందిలో ౹ నసువులుండ
గడిసి నీ యెదరఘురాము ౹ పదములుండ
పావనీ! సీత! నీకెట్టి ౹ పాటుగలిగె?
తల్లీ! నీకే, యిట్టికష్టంబులందిన నితరులఁ జెప్పనేల?
సీ॥ దాసదాసీలచే ౹ తన వనుల్గొనుపుణ్య
సతిగుండె దాన వ్యసనతులననుమ
పతిలాలనంబును ౹ బడయుసాధ్వీమణి
భీషణభాషల ౹ బెదరవలసె
దేవేంద్రవంద్యుని ౹ దేవేరి యీసీత
రక్కసిబాధల ౹ సుక్కవలసె
సరస రాజాన్నముల్ ౹ కరమారగించు నీ
సతి యిట్లుపాసముల్ ౹ సలుపవలసె
గీ॥ నాథులకు నాథుఁడగు రఘు ౹ నాథుభార్య
నాథునెడఁబాసి నేడిట్లు ౹ నాథవలెను
దిక్కులేక సురారిచేఁ ౹ జిక్కనవసె
విధికృతంబనఁగానిట్టి ౹ విధమకాదె?
గీ॥ మానససరోవరవిహార ౹ మతినిఁజెలఁగి
కాంచనసరోజనాళము ౹ ల్గలయమెసగు
మత్తహంసినినత్తల ౹ మడుగుఁ జేర్చె
కాలమొకరీతిఁ గడుపఁగా ౹ గలరెయెవరు?

(తెరలోఁ బెద్ద కలకలము)

హను: ఏమీ? యీభయంకరధ్వని, ఆహా రావణుఁడు, ఇచటికే వైభవముతో సతీజనులతో వచ్చుచున్నవాఁడు. ఈదురాత్ముని బాగుగాఁ బరిశీలించుటకు ననువగునట్లు ఈచెట్టుకొమ్మలలో దాగియుండి వీని

వృత్తంబరయుదునుగాక (మూడుచుకుని కూర్చుండును. మరల తెరలో ధ్వని)

సీత: అయ్యో! దుర్మార్గుఁడగురావణుండువచ్చుచున్నట్లున్నాఁడురామా! ప్రాణేశ్వరా! నేనేమిచేయంగలదానను. రామా! రామా! రాఘవేంద్రా!

కీర్తన

అరమరసేయకురామా - అసురునిదుర్నయమణఁగ
శ్రీమయనియెంచక - హరిణము కొఱకై -
యమలినగాత్రి! నిన్ననిపినఫలమిదె ॥అ॥

రావ: (ప్రవేశించి) జానకీ! యింకను ఏడ్పులేనా? వట్టిబేలవుగదా! నీవు. సుకుమారివగు నీవిట్లు మొండిపట్టుపట్టి సుఖదూరవైతివి. నీవోటి జగదేకసుందరి, సకలసుఖార్హ యిట్టి నెఱిమాసిన చీరతో నెఱులతో నుండుటఁ జూచి, సైరింపలేకున్నాఁడను.

కీర్తన

రావ: బెదరనేల? నీ-విధినోఘనకచా! ॥బె॥
మదిరనయన! నీ - వదయతఁగనినన్!
మదనుఁడదయుఁడై - విదళించెనునను ॥బె॥
కరుణమాలినన్నుఁగనవు - ఘనమె! నీకుఁజారుముఖీ
వెఱపువిడిచి సరసగుతిని - సరసఁజేరిపల్కుమా ॥బె॥

సీత: (చెవులుమూసికొని యేడ్చుచు) రామా! రామా! యీ మదోన్మత్తుఁడిట్లువదరుచు,హృదయభేదనంబుసేయుచున్నాఁడు.హానాథా! నిన్నుఁగాక యన్యులంగలనైన దలంచనొల్లని నీయిల్లాలి,నుద్ధరించ నీకంటె దిక్కెవ్వరు? లోకనాయకుఁడవగు నీయర్ధాంగినగు నన్నుఁ బాలింపుము. నన్నుబాధించు దుర్మదాంధునిఁ దుత్రింగఁజేయుము. నీకంటె వేరుండికెవఁడుగలఁడు? రామా! రమ్ము. రమ్ము. నన్ను రక్షింపుము.

రావ: ప్రియురాలా! జానకీ! నీవెట్లు దూషించినను సైరించువాఁడను. నీవీ కఱకుఱానేలపై నెన్నాళ్ళిట్లు నీయొడలు గాసిఁజేఁదఁబండ

దవు, నా సౌధాంతరంబున, హంసతూలికాతల్పంబున నాతో సుఖంబుగ.

సీత: ఛీ దురాత్మా! నీకు వినాశకాలంబే తెంచినది, హా రామచంద్రా! ఈ నీచుని ప్రల్లదములు, మితిమించుచున్నవి, ఈనీచున కెట్లు, ప్రత్యుత్తరమీయను?

హను: (తనలో) తల్లీ! నీపాతివ్రత్యము, కొనియాడందగినది, నీకుఁ ద్వరలో జయము సేకూరును, నీనాథుఁడు, నిన్నుద్ధరింపఁగలఁడు.

రావ: సీతా! నీయందునాకుంగల ప్రేమ, నీవెఱుంగవు, నీకు దాసుండ నయ్యెద.

సీత: ఛీఛీ! నీచాత్మా! పతివ్రతల భంగపఱుపఁ బ్రతిజ్ఞనూనిననీకుఁ బ్రత్యుత్తరంబీయఁగూడదు, అయినను, నీమేలెంచి, నీయందుఁ బుత్రీభావముతో, హితముఁ బల్కెదను. వినుము.

ఉ॥ పుట్టితిభూమిగర్భమునఁ ✱ బుణ్యవతంసు గృహంబుమెట్టి చే
పట్టితినాహృదీశునిఁగఁ ✱ బంకజసంభవ రుద్ర శక్రులే
పట్టుసమీరానివిభుఁ ✱ బ్రాజ్ఞ జగత్ప్రభు రామచంద్రు నే
నట్టిమహాత్ముభార్య నను ✱ నంటఁగఁగోరెదె? నాశనార్థమై.

రావ: వికటముగనవ్వి, రమణీ! యింకనూ, రాముఁడే, నీరమణుఁడని, యెంచుచుఁ బొగడుచుంటివా? యీలంకాధిపతియన నేమనుకొనుచుంటివో? అలతిగా నెన్నకుము, విను విను.

సీ॥ దిక్పాలురెవ్వాని ✱ దిక్కునఁబనులెల్లఁ
బచరించుదురుసదా ✱ బానిసలుగ
నెవనివీటినిఁజుట్టి ✱ యవిలంఘ్యవారాశి
ప్రకృతివినిర్మిత ✱ పరిఖయయ్యె.
నెవఁడెత్తగానేర్చెఁ ✱ బువ్వోలెఫాలలో
చనువాసమహాగిరి ✱ శంక లేక
నెవ్వనిమాయచే ✱ జవ్వనిఁగోల్పోయి
రాముండువీర్యవి ✱ రాముఁడాయె.

గీ॥ బీదనరుఁడేడ? సంద్రంబు ✱ నీదుటేడ?
గడసినన్నాజినెదురింపఁ ✱ గలుగుటేడ?

వదలి దుర్భ్రమ వేగన న్వలచి ప్రేమ
లంక నేలుము నేను నీ కింకరుండ.

సీత: ఛీ ప్రేలరీ! నీవంటి మూర్ఖుఁడెందును లేఁడు, నీబలము, నేనెఱుంగనిదిగాదు. ఒంటరినై యున్న, యబలనగు నన్ను శూరుఁడవై గొని తెచ్చితివా? చోరుఁడవై తెచ్చితివా? రామునియెదుటనైనచో, నీ బీరము లావును, తెలియవచ్చెడి నేగదా! రాముఁడేల? రామానుజుఁడున్నను జాలునే, నీవేమగుదువో? నిన్ను నీవే పొగడుకొనకుము, జగమంతయు, నిన్నెఱుంగును, రాము నెఱుంగును.

సీ॥ నినుబందెగొన్న య ర్జునిఁగూల్చిన భార్గ
వుని బాహుగర్వంబుఁ బొలియఁజేసె
అంఘ్రిరజమున న హల్యశాపముఁబాపి
గౌతమమునితోడఁ గలిపినాఁడు
ఏదేవతలునైన నెత్తఁజాలనిరుద్రు
వింటెని రెండుగా విఱిచినాఁడు
గాధేయు జన్నంబు గాచి తాటకిఁగూల్చెఁ
బదియు రెండేడుల ప్రాయముననె
గీ॥ అట్టి రాముని కొక లెక్కయా? తలంప
నబ్ధిదాటఁగ నిన్నుఁ జెం డాడ లంక
మంట గలుపఁగ; నీ కొక్క మాయ దెలియు
చోరుఁడవు మాటలేటికి? శూరునిబలె.

రావ: ఆ, ఏమీ? దీని ప్రల్లదములు!
క॥ ఆఁటదిగా యని తాళిమిఁ
బాటించిన హెచ్చె నార! ప్రల్లదములు ని
ప్పాటున నా కరవాలపుఁ
బోటునఁ గూల్చెదను దీసిఁ బూని ముదమునన్.

ధాన్యమాలిని: (అడ్డము నిల్చి రావణునిఁ బట్టుకొని) రాక్షసేంద్రా! శాంతింపుడు. శాంతింపుడు. నిర్జరేంద్రాద్యఖిల దిక్పతుల గర్వంబును గనుగీటున నడంచిన, త్రిలోక వీరుఁడవగు నీవు చంద్రహాసాహతిచే, నొక్క యబల యగు, మానవ మానినిం గూల్చినచో, నీ కరంబు

నకును, కరవాలంబునకును, ఘనతర వీర్య శౌర్యంబులకుం గూడఁ గళంకంబుగాదే? యిప్పటికి కోపం బుపశమింపం జేయుడు, ఇంకం గొన్నిదినంబులేగినచో, నామెయే పెంకెతనంబువదలి, నీకు స్వయంగాప్రియాసౌఖ్యంబు, సమకూర్చును. నీబోటి మేటివీరులకిం తొందర పాటుదగునా? నీవు సకల శృంగార కళా కుశలుండవు గావే? నీకై వచ్చిన నన్నుం గనుము. పోదము రమ్మా.

రావ: రాక్షసాంగనలారా! వినుఁడు.

గీ॥ తాళుమను రెండుమాసాలఁ | దనుక నింతి
నమ్మతించుటయొండెను? | జచ్చుటొండె?
ఈవిధ నెట్లన మీరు నా | కొడఁబరపుడు
కోర్కెలలరఁగ సిరులెల్లఁ | గూర్తుమీకు.

రాక్షసస్త్రీలు: చిత్తము! (రావణుఁడు నిష్క్రమించును.)

సీత: హా రామా! రామా! కౌసల్యా కుమారా!

సీ॥ మునిపత్నిఁ బ్రోచిన | కనికరంబున నెంచి
తనపత్నిఁ బ్రోవఁగాఁ | దలపలేఁడె?
గాధేయు జన్నంబు | గడపగల్గెను దన
పడతిబన్నంబులు | గెడపరాదె?
హరుచాపమును ద్రుంచి | యశముగాంచిన మేటి
యమరవైరినిఁ ద్రుంచి | హాయి నిడడె?
పరశురాముని గెల్చు | వరదివ్యతేజస్వి
యసురతేజము నాజి | నడపలేఁడె?

గీ॥ ప్రాణవిభు రామచంద్రు నా | పాలిదైవ
మని త్రిశుద్ధిగఁ దలఁతునే | నాదయాబ్ధి
రాక్షసాధము రావణు | రణమునందు
గెలిచి నన్నేల నిరు మాసములకు రాఁడె?

రాక్షసస్త్రీ: ఓసీ జానకీ! ఎంత మొండితనమే? నీవింత పెంకిదానవేమే? నీ మూలమున మాకుఁగూడ, నిక్కట్లురానున్నవి గదే? హాయిగా, రాక్షసేంద్రునిం జేపట్టి, సుఖింపలేక చేఁజేతల నిట్టి పాట్లు దెచ్చి

పెట్టుకొనుచున్నావే? మా మాటలు వినవేని నిన్నుఁ బ్రొద్దుటి యోగిరములోనికి నూరుగాయగాఁ జేసికొందుము.

సీత: హా రామా! నాకు వీరిచే నిట్టి దుర్మరణమే సిద్ధమా?

కీర్తన - నీలాంబరి

హా నన్నుఁ గనువారే లేరే - యాపదబ్ధిదాటించు కృపాళుడు
- హా నన్నుఁబ్రోవరాలేరే - ॥హా॥
ప్రాణనాథుఁ నెడఁ - బాసితి నే నీ - పాపాత్మునిచేఁజిక్కి--
బాధపడితిని - మోసపోతిని
ఈతరి - పరమదయాప్తిని - ఘనమతి ॥హా॥

రాక్షసస్త్రీ: సీతా! రావణుని పలుకులునీవును వింటివిగా! ఇఁకనైనను, మామాటలువిని నిన్నును, మమ్మును, గాపాడుకొనుము.

సీత: తల్లులారా! నన్నేల బాధించెదరు? మీకు నమస్కారములు. మీరు నన్నుఁజంపి తినినను సరియేగాని నేనురామునిఁగాక, కలనైన బరపురుషునిం గననోపను- తలంపనోపను- తాకనోపను- మీకుఁ బుణ్యమబ్బును- నన్నువధించి తినుడు: లేదా నాజోలికిరాక మిన్న కుండుడు.

హా రామా! దాశరథీ! రఘుపతీ! నామొరాలకించి నన్నుద్ధరింప రమ్ము, లక్ష్మణా! మీయన్నయానతిఁగొని, నీవైన నన్నుఁ గాపాడ రమ్ము, అనలానిలతుల్యురగు, మీరలేమిదలంచినఁ జేయంజాలరు? నన్నురక్షింప కిట్లుపేక్షించుట, నాపాపమే? నాయుండు జాడయైన మీకుఁ దెలిసినఁగదా! పక్షిరాజు, ప్రాణముతో నుండెనేని నా పోకడఁ జెప్పకుండడుగదా!

త్రిజట: (లేచి) ఓసిర రక్కసులారా! యిటురండి; ఆమె జోలికింబోకుడు. ఆమె మహాత్మురాలు; పదండి; పదండి; పడినిద్రఁబోదము; నే నొక కలకంటిని; చెప్పెదరండు. (అందరు పోవుదురు)

సీత: ఈ రక్కసికాంతలందరు, దూరముగఁబండి, నిద్రించుచున్నారు. నాథునెడఁబాసి బాధలంబడఁజాల, వీరు, మేల్కొనకమున్నే, ప్రాణంబులు వీడుటలెస్స. యీ నాజడయే, యురిపోసికొనియెదను.

ఏమిది? యెడమకన్నదురుచున్నది? నాకేమి మేలుకలుగును? ఇట్టి దౌర్భాగ్యురాలికి, నాథుని సేమమే వినవోచనైతిఁగదా !

కీర్తన - దేవగాంధారి

అకటా యీగతినే - నలయుదునని - యాత్మనెంచ నేరనుగా -
అఖిలకష్టముల-కాలయమైతిని - ఆరఘురాముని - బాసితి బ్రతికితి ॥అ॥
సకలకలుషగహ-నాటవినై - శ్యావరసర్వలోకర-క్షాకర -
శరణాగతార్థి - జనశుభంకర - జానకీహృదయ కం-జాతదినాకర ॥అ॥
ఎంతని నేను సహింతును రామా - యేమి సేతు నిఁక-నెవరు బ్రోచెదరో ॥అ॥

కీర్తన - జంఝూటి

హనుమంతుఁడు: రామా! రామా! - రవికులసోమా! -
దానవభీమా - జగదభిరామా ॥రా॥
సురుచిరనామా - ముఖజితసోమా -
శుభగుణధామా - ప్రేమోద్దామా ॥రా॥

సీత: (నలుదెసలుపరికించి) ఆహా! యేమి? యీలంకలో నెవరో, రామ నామము, నుడువుచున్నారు, ఎన్నాళ్ళకు నాస్వామి, నామాక్షరములు చెవింబడెను. ఇట్లు పలుకువారెవరు.

కీర్తన - జంఝూటి

హను: క్షేమము క్షేమము క్షేమము - శ్రీరఘు, రామమూర్తి
- క్షితిజాతా! సీతా! ॥క్షే॥
సౌమిత్రియుతుఁడై -గొనిచనునిను-భామరో! నీపతి ప్రాభవమతియై॥క్షే॥

సీత: ఈపలుకు లెవ్వరివి? ఎన్నిదినంబులకు, మన్నాథుండగు శ్రీరాముని సేమంబు వినగల్గితిని? (ఇటునటుచూచి) యేమిది? యీవానరుండెవ్వఁడు? రామక్షేమవార్త దెలుపు చున్నాఁడు, క్రోతిఏమి? ఇట్లు వక్కాణించుటేమి? కలయా? నిజమా? నిదుర లేసినాకు, కల వచ్చునా? అయ్యో! ఎంత మోసపోయితిఁ, ఓరీ! దుర్మార్గా! రావణా! నీమాయలు, కనుగొంటిని. ఇట్టి, వాచక బుద్ధులునేర్చి, నీవెన్నాళ్లు శుభములు పడయఁగలవు? దండకాటవిని నొంటిమైనుండగా మాయాభిక్షుక రూపంబున నన్నుఁగొనివచ్చిన.

కపటశీలుఁడవు గావటరా ? ఛీ! ఛీ! హా మ్మా. (కన్నులు మూసికొని) రామా! రామా! రమ్ము. త్వరగా రక్షింపుము. నన్నుద్ధరించుము.

హను: మాతా! సీతా! యించుక శాంతించి, నా మనవి వినుము.

గీ॥ అమ్మ! రావణుఁడనుగాను | నమ్మమింక
రామచంద్రసందేశ వా | ర్తలను బ్రీతి
నీకుఁ దెలుపఁగ వచ్చితి | నిర్మలమతి
రాముదూతను హనుమంత | నాముఁడండ్రు.

తల్లీ! పర్ణశాలయందు నిన్నుఁ గానక రాముఁడు తమ్మునితోఁ గలిసి మిగుల వగల నొగులుచు వెదకి వెదకి కాననంబెల్లఁ దిరిగి తిరిగి కొనయూపిరితో నున్న జటాయువువలన, నీ పోకడ యెఱింగి తుదకు ఋశ్యమూకగిరిం జేరి సుగ్రీవునితో మైత్రి నెఱపి

సీ॥ రవిసూతి కథయంబు | రాముఁడొసంగి దుం
దుభిఁ గాలి వ్రేలితోఁ | దూలమీటి
నొకకోలఁ దాల స | ప్తకమునఁ బడఁగూల్చి
వాలమ్మొకట వాలిఁ | గూలనేసె
కోల పోయినయాలిఁ | గూర్చె సుగ్రీవుని
కిప్పించె రాజ్యంబు | నెలమిఁ జెలఁగ
నంగదు యౌవరా | జ్యమున నిల్పెనుగీశ
కోటులు తనుఁ జేరి | కొలుచుచుండ
గీ॥ మాల్యవంతమునుండి రామ ప్రభుండు
కలయ నిను రోయ నెల్లెడఁ | గపులఁ బంప
వారిలో మేము దక్షిణ | భాగమెల్ల
నంగదునిఁ గూడి వెదకితి | మవనితనయ!

తుదకు సంపాతిచే నీవృత్తాంత మానుపూర్వికముగా నెఱింగి, నేనొకండ నీ సముద్ర లంఘనంబొనరించి ఈ లంకం జొచ్చి, వెదకి యిందు నినుం గంటి. ప్రతిన నెఱవేరమంటి. కపులందరిలో సీతం గాంచె హనుమానుం డొక్కఁడే నను బిరుదానఁగంటి. జననీ! నా కష్టంబులును నీ కష్టంబులును గడచినవి. ధైర్యంబూనుము.

సీత: కపివరేణ్యా! రాముని సేమవార్తలెఱింగించుటకు సంతసించితిని. గాని రక్కసిమాయలంజిక్కి పొక్కుచున్న నేను నిక్కలంబుల నీపలుకుల నిక్కువంబులని నమ్మంజాలకున్నదాన. నీ యాడిన మాటలునిజంబైన, నీవు రాఘవుల నెఱింగియేయున్న వారి గుణ రూపంబులెట్టివో? యెఱింగించితివేని? విశ్వసించెదను.

హను: తల్లీ! చిత్తగింపుము.

సీ॥ శ్రీకారములఁబోలు ౘ చెవులతో స్నేహంబు
నొనరించుమూపుల ౘ నొప్పువారు
గండుతుమ్మెదలట్టి ౘ ఘనమీసములవారు
నిండుజవ్వనమున ౘ నెగడువారు
చందమామను నవ్వఁ ౘ జాలుమోములవార
లాజానుబాహువు ౘ లమరువారు
ఇంపైన కంఠీర ౘ వేంద్రావలగ్నముల్
వెడదయురంబులు ౘ వెలయువారు
కార్ముకంబులఁబోలు ౘ కనుబొమల్ తమ్ములఁ
గనినవ్వునిడు వాలు ౘ గనులవారు
నీలాంబుదంబుశ్యాం ౘ పాలతలనుమించు
మేనికాంతులచేత ౘ మెఱయువారు
గజరాజసమయాన ౘ గరిమ నొప్పెడువారు
పటువిక్రమస్ఫూర్తిఁ ౘ బఱగువారు
రామసౌమిత్రు లన్ ౘ నామముల్ గలవారు
సములన్నిగుణముల ౘ జమిలివారు
గీ॥ మారునకు రూపముల మారు ౘ మారులగుచు
వైరివరులకు మృత్యుదేవతలె యగుచు
యాచకాలికి సురభూరుహంబు లగుచు
భాసిలుదు రక్ష్యతనూ విలాసులగుచు.

సీత: ఆహా! నేడెంతసుదినము! హృదయ నాథుని దివ్యమంగళవిగ్రహుని గుణరూపవర్ణనంబు శ్రోత్రపేయామృతంబులుగ వినగల్గితిని. హనుమా!

నిన్ను నాకడకుఁబంపుచో నానాథుండు నాకేమని చెప్పుమనియె
తెల్పుము.

హను: తల్లీ! నన్ను నీకడకుఁబంపుచో నీమనోనాథుండిట్లు తనమాటగాఁ
ననుమనియె

సీ: నిన్నుఁబాసినదాది | నన్నదమ్ములువెసఁ
గన్నుమూయరు పన్ను | గదుపరనుము
కన్నీరునేరుల | గతిఁబార నెవ్వేళ
నెడలేక తుడుచుచే | యెఱుగరనుము
అసువులువీడఁగ | నాత్మనెంచియు ధృతి
నీ క్షేమమునుగోరి | నిలిచిరనుము
రామచంద్రుఁడు రక్తి | రామానుజుఁడు భక్తి
నియతి నీపై మదు | ల్నిలిపిరనుము.

గీ॥ కష్టములుపొందు కాలంబు | గడచెననుము
శత్రునిర్మూలమునొనర్ప | క్షాత్రమునను
జనకజానందకరమగు | శపథమూనె
ముద్రికను నీకనిపె రామ | భద్రుడనుము.
అనిచెప్పుమనియె. ఇదెముద్రికంగొనుము (ముద్రికనిచ్చును)

సీత: (ముద్రికంగొని) కన్నులనద్ది యక్కునఁగదిపికన్నులనీరునించును.

హను: తల్లీ! యింకను వినుము.

గీ: నీయునికిపట్టెఱుంగక | యిట్టులింత
కాలమేగను జేసిరి | జాల మనుము
దుఃఖజాలంబు నిన్నింకఁ | దొలగుననుము
రాముఁడుభరించె నీకునై | ప్రాణమనుము.

సీత: తండ్రీ! హనుమా! నీయట్టి ప్రాణబంధుండెందును లేఁడు. నాథుని
యుంగరముంగాంచి, నాథునింగాంచినట్టులే తలంచి ప్రాణంబులు
భరించుచున..

సీ॥ సుదినంబునేడగా | శ్రోత్రపేయామృతా
మన్మనోనాథుసే | మంబు వినుట

సుదినంబు నేడుగా × సువిమలహృదయుండౌ
మఱఁదిలక్ష్మణుని సే × మంబువినుట
సుదినంబునేడెగా × హృదయవల్లభు ముద్దు
టుంగరమ్మును జూడంగఁగలిగె
సుదినంబునేడెగా × తుదిలేనినాచింత
కంతంబుగలదను × నాసగలిగె.

గీ॥ "కారవుముసేయవేలాటి × కష్టములను
ప్రాణముండిన సౌఖ్యంబుఁ × బడయఁగలుగు"
ననెడువిబుధోక్తి యిటసత్య × మాయె నయ్య
యెన్నినాళ్లకు వింటి హృ × దీశువార్త.

హనుమా! రామభద్రుండిచ్చటికెన్నడు వచ్చును? ఎన్నడీ రావణుంగూల్చి నన్ను రక్షించును? రావణుండు నాకిడిన గడువు రెండు నెలలే మిగిలినది. అంతదనుక నెట్లో, మేను భరింతును. ఆపైనొక్కనిముసంబేని బ్రతుకంజాలను. అప్పుడు రాముఁడువచ్చియు లాభములేదు.

హను: అమ్మా! వినుము.

మ॥ విలపింపన్ వలదమ్మ నీవిభుఁడు దా × వేగంబ సన్నాహియై
బలుసైన్యంబులఁ జేర్చి రావణు ననిన్ × భంగింప రానుండె నా
కులతం జెందకుమమ్మ యందనుక నీ × కుందాల్మి లేకున్న నా
తలపై నెక్కుము రాముఁ జేర్తు రవియ × స్త్రంబందకుండన్నినున్,

సీత: తండ్రీ! మారుతీ!

ఉ॥ అంతటివాఁడవౌటెరుగు × దాత్మజుఁ గానిను నెంతు నన్నునా
కాంతునిమోసగించె దశ × కంఠుఁడు ముచ్చిలెవానిఁ జంపకే
కాంతునికీవు నన్నొసగఁ × గైకొనలోకులు నవ్వరే ధరా
కాంతుఁడె దైత్యుకంటెఁ గడు × కత్తెరదొంగయటంచు మారుతీ!

కావునఁ బావనీ! నీవు వేగమే; రాఘవేంద్రుల సన్నిధికేగి యీ యుదంతంబు నెఱిఁగించి సత్వరంబు దోడ్కొనిరమ్ము.

హను: జననీ! నీపలుకులు నాకు సమ్మతంబులే; రామునిఁ జేరుటకై నామనంబు వేగిరపడుచున్నది; నేనింక రాఘవుల సన్నిధి కరిగెదను; వారలు నమ్ముటకుందగిన; యానవాలేమైననుదయచేయుము.

సీత: హనుమా! నానాథుఁడు నమ్ముటకుం దగిన యానవాలుగ; నీ సింధుజాతంబగు; నాశిరోరత్నంబునొసగెదఁగాని, నీవుఁజూడగఁగడుఁ గురుచమేని వాఁడవు, ఈ జీవరత్నంబు నెట్లు దాచం గలవాఁడవు, నాకు సందియంబగు చున్నది.

హను: తల్లీ! అటులనా! నీసందియం బిప్పుడే పాపెదను. రామచంద్రా! కరుణా సాంద్రా! నాపాలి దైవ శిఖామణివి, నన్నుద్ధరింపుము.

(నమస్కరించుచు)

కీర్తన

ఘనరూపమీ వేళ - దయసేయవే వేగ -
నను జానకీదేవి - నమ్మునట్టుల బాగ ॥ఘన॥
ధరణిజ నను నమ్మఁ - దగు రూప మిమ్మా నీ -
సరిదైవమెవరుందు - రరయ నీజగమందు ॥ఘన॥
భువనైకరక్షణ - పూనివారాన్నిధి -
నవలీలదాటించి - తయ్య నీదయఁజూపి ॥ఘన॥

(హనుమంతుఁడు, తేజోరాశియగు, నిజరూపంబుతో నిల్చును)

సీత: హనుమంతా! నమ్మితిని, చాలుఁ చాలు.

క॥ చుక్కలు తలనంటగఁగన, వెక్కసమై దిశలనిండి వెలసిల్లెడునీ యక్క జమగుఘనరూపము, నిక్కముతో లిరూపుఁజూపు నిర్మలచరితా!

హనుమా! నీయనుపమాన ప్రభావంబున కాశ్చర్యంబును, నానందంబునుం జెందితిని.

హను: (చిన్నవాఁడై నిలిచి, నమస్కరించును)

కీర్తన - తోడి - రూపకం.

సీత:

సమీరవరతనయా - సి-ఘనాకృతింగనఁ - బ్రమోదమాయెన యా -
సమానమెవరు వి-షమానబలవి-క్రమాటోపధా-సమానవిధివగు ॥స॥
దరంబులేకే - సురారిపురి ని - బ్బరంబుగాఁజొర-దరంబెవరికగుఁ-
దిరంబు చింతా -
భరంబెడలమదిఁ - గరంబలరి త - బ్బరంబుగొలిపితి ॥స॥

వాయునందనా! ఈ నాశిరోరత్నంబు: నాహృదయేశ్వరునకు సమర్పించి; నావిన్నపంబుగా నిట్లు మనవిఁజేయుము.

సీ॥ చటులతరమణిగాఁ జల్పినదివ్యపా
దంబుల కనయంబు దండ మనుము
సురుచిరచరణుని హరిణంబు వెనువెంట
నంపినయఘము వ న్నంగొ ననుము
కన్నతల్లికిమిన్నఁ గానెంచుసౌమిత్రి
నట్లుదూరినఫల మమర ననుము
ప్రాణానిలంబులు రామనామామృత
స్వాదనచే నిల్వఁ బడియె ననుము
దుర్మదాంధుఁడైదైత్యుఁ దుర్గించి నను గొని
చన రాఘవునకును శౌర్యమనుము

గీ॥ వైరితోఁబోరఁబటి కష్ట పడఁగవలసె
నాచు ననికొప్పదాత్మ యల్లైననింక
మిన్నకుంటయునొప్పదా వెన్నదలఁగ
నెద్దియును జేయఁదోఁపదు బుద్ధి కనుము.

హనుమా! ఎట్లైన నాధుని దోడ్కొనిరావలయు. నంతదనుక నైన నీయుసురులు నిలుచునో నిలువవో? గనుక సత్వరంబుగ వేంచేసి, నన్నుద్ధరించుమని కౌసల్యాతనూజునితో విన్నవించుము. సఫలీకృత కార్యుండవై సత్వరంబుగఁ బోయిరమ్ము.

హను: భూజాతా! మాతా! ధన్యోస్మి. ధన్యోస్మి నేనిచ్చటనుండి వెడలుటయే తడవు. రేపేవేళకే రామునితో వానరబలముతో లక్ష్మణ సుగ్రీవయుతంబుగా వచ్చితినని తలంచుము. పోయివచ్చెద.

సీత: మారుతీ! పోయిరమ్ము.

హను: నమస్కరించి పోవుచు,

క॥ నారాకఁదెలియుటకునై,
యారామంబెల్లయిపుడె హత మొనరింతున్

క్రూరాసురు లెదిరించిన
నా రావణుచిత్త మగలఁ జననిఁబడఁగూల్తుఁ.

కీర్తన

త్రుంచెదన్ ధరాజముల్-త్రెంచెదన్ లతావళుల్, -నొంచెద-విదళించెద- విలపించఁగ- దనుజౌఘముల్ ॥త్రు॥

అసురుని వనమిల్లగ్గఁ- మసిచేసెదఁజాలఁ- అసురభటుల- రసదోలంగ- కసిమసఁగెదలీలఁ ॥త్రు॥

(ఎగురుచు దుముకుచు నిష్క్రమించును) తెరజారును.

చతుర్థాంకము సమాప్తము.




(పంచమాంకము)

అశోకవనము

(హనుమంతుఁడు ప్రవేశించి) సింహనాదము చేయుచు లంఘించుచు.

ఉత్సాహ: జయము రామమూర్తికిన్ బ్రశస్తధర్మవర్తికిన్
జయము జానకీ మనోంబుజాతభృంగమూర్తికిన్
జయము భద్రశీలికిన్ విశాలకీర్తిశాలికిన్
జయము గర్వితాంధదైత్యశౌర్యదావకీలికిన్.

గీ॥ జయము సౌమిత్రికిని సూర్యజాతునకును
జయము శ్రీధాత్రిపుత్రికిఁ జారుశీల
కఖిలదానవగర్వాపహారిరామ
చంద్రునెయ్యంపుటింటికి జయము జయము.

గీ॥ నందనముఁ గేరు వనమేర్చి నాఁడఁ జేర్చి
దనుజబలములఁ బరిమార్చి తనరినాఁడఁ
బోరనెదిరిన బోరన నీరుఁ జేతు
రక్కసులనెల్ల నేను శ్రీరాముదయను.

అదిగో! నాతోఁ బోరాడ నెవ్వరో వచ్చుచున్నారు, కసిమసగి యుసురులం బాపెద.

(తెరలో)

అక్షయకుమారా! అడుగో! ఆదుష్టవానరుఁడే, వనంబెల్లఁ బాడు చేసి, వనపాలకులను గూల్చనేసి, కయ్యంబునకుఁ గాలుదువ్వుచున్నాఁడు.

(అక్షయుఁడు కొందరు రాక్షసులతోఁ బ్రవేశించి, హనుమంతు నుద్దేశించి)

అక్షయుఁడు: వానరాధమా! నిలుము గంతులు రంతులు మానుము. అంతకాలయంబున కరుగ సంసిద్ధుండవు గమ్ము.

గీ॥ బడుగు రక్కసి మూకల ǀ నడచు టొక్క
నిక్కమగు బీరమంచును ǀ నిక్కఁ బోకు
మిల్లలికి నంతవుండుగా ǀ నే? తలంప
నక్షసుతు నన్ను నెదురింపు ǀ మాజి నిలిచి.

హను: సింహనాదము చేసి రాక్షసాధమా! రమ్ము, రమ్ము.

గీ॥ అక్షయుఁడవైన నేమి? నా ǀ కగు నె భయము?
పేరుమాత్రంబె కానేతి ǀ బీరకాయ
క్షయుఁడవయ్యెద వింక నీ ǀ క్షణమునందె
చూచెదరు నిన్ను నీవారు ǀ శూరమాని!

అక్షయుఁడు: కీర్తన - సావేరి

తొలగుపలువ పెలుచం - దనమిటందగునటరా
బలునిరీతినాతోఁ - బలుకనిటుల - కీశా! ॥తొ॥
సదమదముగ - మదమడచెద
మదిఁ జెరచెద _ విదళించెద ॥తొ॥

హను: ఆహాహా! యేమి? వీరాలాపము.

గీ॥ తెలియు నీ తండ్రి బలశౌర్య ǀ తేజములును
కార్తవీర్యుని చేతిలోఁ ǀ గట్టువడఁడె?
వాలి చేఁ దూలి బేలయై ǀ జాలిఁబడఁడె?
వాని సుతుఁడవు నీవుగా ǀ వా? తలంప.

అక్ష: అరే వానరాధమా! ఏమంటివి?

సీ॥ కుప్పించి దుముకంగఁ ǀ గజశాఖలివిగావె
యసురేంద్రనగరహ ǀ ర్మ్యాళిగాని
చవిదీర నమలంగ ǀ జామపండ్లివి కావు
గుండెదూయు ఫిరంగి ǀ గుండ్లుగాని

చెఱలాఁప సీతోడఁ జెనటికోతులుగావు
కాలసన్నిభదైత్య పాళిగాని
తీటదీరగఁగోకఁ దాటగొల్లివిగావు
చక్రిఁజేసెడు బాణ సమితిగాని
గీ॥ ఆహవంబన నేమని యూహగలదొ?
ఫలములనుమెక్కి మధురసం బులను గ్రోలి
పెంచియుండిన కాయంబు మించితు ద్రెంతు
మృత్యువాతనీకు సిద్ధంబు సత్యమింక.

హనుమంతుఁడు :

తే గీ॥ భర్త దరిలేనితరిఁజూచి పరమసాధ్వి
బలిమి ముచ్చిలు టది శూర భావమగునె?
తెలియమెన్నడు సమరంబు తెరగు మేము
విన్నవారము నీతండ్రి పున్నమునను.
ఆ చోరశిఖామణి కుమారుఁడవే నీవు.

అతి: పేలరీ వానరా!!
క॥ పరమశివారాధన త
త్పరుఁడును శివకృత్తివహిత వరబలు వసురే
శ్వరు నెఱుగ కేల వదరెదు?
కరవాలము కెఱనొనర్తుఁ గనుమినుఁ గీశా!

హనుమంతుఁడు : కీర్తన

ఓరీ! నీవిటుల్ గడంగ - నగునె సాహసంబుతో
నగముఁ తోడ దగరుపోరు - నటులె నాతోఁ - బోరనాన॥ ఓ॥
భయమువీడి నిలిచిపోగ - జమునివీటి కాపుగాఁ
నిముసముగ నొనర్తుఁజూవె - నేదురమ్ము పోరికిఁ ॥ఓ॥

అతి: అరే! మూర్ఖా!
ఉ॥ నోటికాలందిఁ బేలితివి నుగ్గొనరించెద నీదుచేతులీ
యాటలు సాగవింక నిను నాహవమందున, దేహమెల్ల వే

తూటులొనర్చి తండ్రిమది తోషణమందునటుల్ చరింతు నే
పోటరి యడ్డమైన నిశాటుఁ బోవఁగ నిత్తునె? పోరఁగూల్చకే.

హనుమంతుఁడు :

క॥ వదరెదు తెలిసియు తెలియక
మదిఁగొనకుము కరుణమనుపు మనవిని వినుమీ
సదయత నన బ్రదుకుఁ గనుదు
వదయత నిను బలిగొనియెద నటులొదవనిచోఁ.

(మత్తకోకిల)

అక్ష : భూరుహంబుల సంచరించెడు । పోతరంబది చెల్లునే?
కారులన్ మఱి ప్రేలెదేటికిఁ? । గాచుకొమ్ము మహాస్త్రమున్

హను: దారుణాస్త్రము నేసితంచును । దానవా! బెదరించెదే?
భూరుహాహతిఁ గాచికొమ్మిదె । ఘోరువన్ నినుఁగూలుచున్.

అక్ష : హా! నిలు. నిలు. (నేలఁగూలుచున్నాఁడు)

రాక్ష: అయ్యో! రక్కసులారా! అక్షయపుత్రుఁడు హతుఁడైనాఁడు.
మననింక నీ క్రోతివాఁడు మననిచ్చునా? పదుడు పదుడు
(రాక్షసులు నిష్క్రమింతురు)

హను: గర్జించుచు (రక్కసులందరుం జచ్చిపోయినారు. ఇంకఁదరు
వాతి కర్తవ్య మాచరించెద)

ఉత్సాహ: జయము రామమూర్తికిం బ్రశస్త ధర్మవర్తికిం
జయము జానకీ మనోంబు జాత భృంగమూర్తికిన్
జయము భద్రశీలికిన్ విశాల కీర్తిశాలికిన్
జయము గర్వితాంధదైత్య శౌర్యదావకీలికిన్.

గీ॥ జయము సౌమిత్రికిని సూర్య జాతునకును
జయము శ్రీధాత్రిపుత్రికిఁ జారుశీల
కఖిల దానవ గర్వాప హారిరామ
చంద్రునెయ్యంపుటింతికి జయము జయము.

(తెరలో - పెద్ద కలకలము)

హను : ఆలించి! ఏమీకలకలము? ఎవరో రణకౌతుకంబున వచ్చు చున్నారు.

తెరలో: అరే! వానరాధమా! దిగ్వేదండ, శుండ, ఖండన, పటిష్ఠ, దోర్దండుండగు, దనుజ ప్రకాండుని, యారామంబెల్లఁ బాడొన రించుట, పాణంబులపై నాసవిడచుటగా నెఱుంగుము. దిక్పాలక ధైర్యగర్వ పర్వత విచ్ఛేదుండగు, మేఘనాదుండను, నన్నుమీఱ నీకగునా?

హను: ఓహో! యితఁడే యింద్రజిత్తుగాఁబోలు, రారమ్ము, కానిమ్ము, వీని యాటోపంబునకే జంకుదునా? ఓటఁదలనుంచి, రోకటిపోటు నకు వెఱచుటా? కరుణా కరధియగు, దాశరథి, కలఁడుగదా! జయము రామమూర్తికి (అనిమరల పాడును)

ఇంద్రజి: ప్రవేశించుచు!

మ॥ అరరే! వానర! పారిపోకు మమ రేంద్ర దారిరాశి యారామ మీ కరణిం బాడొనరించెదే? మదిని శంక కాలేశమున్ లేక యె వ్వరిఁగా నెంచుచునుంటివో? మనములోఁ బాకారిదోర్దర్ప సం హారణుం డింద్రజితా నెఱుంగుమిఁకనీక్రియారార్భాటము ల్సాగునే?

రాక్షసాధీశ జ్యేష్ఠ పుత్రుఁడనగు, నామాయావాగురులం గీడ్ప డని, దిక్పాలురు లేరు. నీగంతులురంతులుం గట్టిపెట్టుము, క్రోతిమూక లోనర్చు, తంతు లోక వింతలా మాకు?

హను: ఆ హాహాహా! గర్జించుచు.

గీ॥ అక్షయుఁడనంచు నీతమ్ముఁ డదిరిపడుచుఁ
గడుపుశోకంబు తల్లికిఁ గలుగఁజేసె
వాని పోయినదారిఁ బోవలచినావొ?
ఆలసింపకు కడుదూర మరుగునేమొ?

ఇంద్రజిత్తు: వానరాధమా!

కీర్తన

పేలకు నీ- నాలుక నా - కోలనుజీల్తువెసన్ -
ఆలంబునఁ - గాలునిపురి - జాలములే- కిదె చేర్తున్॥

దురమునఁ జిరుతని - నక్షకుమారునిఁ - ద్రుంచుటకదు బీరంబా॥ పే॥
నీచా! శాఖా - పసరమ! బెదరక - నిలుమిఁక శౌర్యమునన్॥ పే॥
మదమునఁ గదనము - నను నెదురన్ మద -
మడచెద బలరిపు - గెలిఁచిన - వాఁడన్॥ పే॥

హనుమంతు :

గీ॥ తెలిసికొంటిని సీతమ్మ । తెలివితేట
తెలమిఁ దెలిసితి నీతండ్రి । బలిమికలిమి
తెలియుదును నీదుపస వేరె । తెలుపనేల?
కుడుచుకూరకు రుచివేరె । యడుగవలెనో?

ఇంద్ర: ఓరీ! వాచాలా!

గీ॥ బ్రదుకవచ్చును బెబ్బులిఁ । బారిఁబడిన
బ్రతుక నేర్తురు యమపాశ । బద్ధులయ్యు
బ్రతుక నగుఁజూవె కాలాహి । పాలఁబడియు
బ్రదుక రాదని నాభుజ । బలము నెదిరి

హనుమంతు :

కీర్తన

ఎంచకు ననుఁ-ద్రుంచుటమదిఁ-గొంచెపు పనియని?-యసురకుమారా।
మించివెసన్ననుఁ-దుంచుచుగా నీ-యుంచుక నన్నది - రించంగలవే?॥ఎ॥
వానరుండనని - మానసమునసను మానక తలచుమవీర్య -
పూనిక గూల్చెద-నంటివి యేమనఁ - బ్రాణముఁబాపెద -
మానముదూల్చెద॥ ॥ఎం॥

కపియననేమో - కదనమదేమో - కనెదవు వేగిర - మేలయిదే
కుపితుఁడ ననుఁగను - గొనియోజింపుము - అపహాస్యంబుల -
నగుబో జయంబిల ॥క॥

ఇంద్రజి: ఛీ! మూఢవానరా! నీబలము నెదిరిబలంబు నెఱుఁగని యల్ప మతివి, నీతో మాటలేల?

చ॥ వదరిన లాభమా? తులువ! । పిల్లదముల్మది గర్వమొప్ప న
న్నెదిరినఁ గల్గులాభ మది । యిప్పుడెఁ జూపెద రార పోరునం

బెదరక నిల్వ నాయనుజుఁడే జేర్చెదమాటలతోడ శౌర్యముం
బొదలునె? నామ చేతిబలుడే వుంగనుమవ్వాడు నీకుఁదోచురా!

హనుమపై (ములుకులు వేయును)

హను: (చెట్లతో యుద్ధము చేయును)

ఇంద్రజి: వీఁడు శస్త్రాంబులకు నితరాస్త్రంబులకును లొంగువాఁడుగాఁడు.
బ్రహ్మాస్త్రంబున వీనిబీరంబు నీరుంజేసెద (సమంత్రకంబుగ జపించి)

గీ॥ ఇలను నాతండ్రి శివభక్తి నెసగునేని?
ఎలమి నాతల్లి పతిభక్తి వెలయునేని?
పరమగురుభక్తి పరత నే వరలుదేని?
పడెడు హనుమఁడు బ్రహ్మాస్త్ర పాతమునను,

బ్రహ్మాస్త్రము హనుమపై విడుచును.

హను: రామా! రామా! (అని క్రిందఁబడును)

ఇంద్రజి: ఓరి రాక్షసవీరులారా! యీవానరుని దృఢపాశంబుల బంధించి
రాక్షసేంద్రుని సమ్ముఖంబునకుం దోడ్కొనిపొండు.

(రక్కసులు హనుమని బంధించి కొనిపోవుదురు)

కీర్తన

హను: పారావారగభీరా! - ఫణతల్ప నలికల్ప-
పరమపురుషఅహల్యా - పావన! సీతేశా ॥పా॥
వనజనయన-దనుజ హనన - వదలను నీ - పదయుగంబు -
అనఘచరిత-రామచంద్ర అభయమిమ్మ-దయను గనుము ॥పా॥

(అందరు నిష్క్రమింతురు)

## రావణుని సభ

(రావణుఁడు విభీషణుఁడు ప్రహస్తుఁడు ప్రవేశము)

రావణుఁడు: విభీషణా! వానరాధముని నిర్జించుటకై మన యింద్రజిత్తుం
డరిగె. చాలా తడవైనది. ఆలసించుటకుఁ గతంబేమి?

విభీ: వానరుండు నసాధ్యుండని తోఁచెడిని,

ప్రహ: ఈపాటికి వచ్చుచుందురు.

భటు: (ప్రవేశము) నమస్కరించి దేవా! జోహారు. మన మేఘనాధుండు వానరుని పాశంబుల బంధించి తోడ్కొని వచ్చుచున్నాండు.

రావ: (సంతోషముతో) మేలు. మేలు. బలసూదన గర్వభంజనం బొనర్చిన వీరవరునకా వానరంబొక లెక్కయా? ఇటకుం దోడ్కొనిరండు.

(ఇంద్రజిత్తును, రాక్షసభటులచే బంధించి పట్టుకొనంబడిన హనుమంతుండును ప్రవేశము)

ఇంద్రజి: జనకా! వందనంబు, తమ యానతి నీవానరుని నిర్జించి బంధించి కొనివచ్చినాండను. తగినరీతిని దండింపుడు.

రావ: ప్రహస్తా! యీవానరుండెవ్వండో? యేమిపనికై చనుదెంచెనో? యెవరంపిరో? అడిగి తెలిసికొనుము.

ప్రహ: ఒరే! వానరాధమా! మేమడుగు ప్రశ్నంబులకు సత్యంబగు సమాధానం బొసంగితివేని క్షమించి విడుతుము. లేదేని జముపీటికిం బంపుదుము.

హను: రాక్షసేంద్రా! అడుగందలచినవి యడుగుము. సన్నద్ధుండనై యుంటిని.

ప్రహ: ముందు నీవెవ్వండవో? చెప్పుము.

హను: రావణా! వినుము. నేను నిక్కంబుగా వానర వీరుండను. మీ రక్కసులయొక్కయు, నీయొక్కయు, మేటి పోటరితనంబు నెఱింగి పోవచ్చితిని.

రావణు: (కోపముతో) వానరా! ప్రల్లదములు పలుకకుము.

రావ॥ సీ॥ ఎవ్వండవో మాకు నేర్పరింపుము వేగ

హనుమ: శ్రీరామదూతనై చెలగువాండ.

రావ; ఎయ్యది నీనామ? మెఱిగింపరా! మాకు

హను: హనుమంతుండను నామ మలరునాకు

రావ: ప్రముచ్చువై నగరులోఁ జొచ్చితేటికిఁ దెల్పు?

హను: ప్రముచ్చిలి సీతను దెచ్చితివె!

రావ: మన్నుమిన్ను నరయక మాటాడ దేలరా?

హను: అరక్షుమి యే నిన్ను నావహించె

రావ: గీ॥ వదరు నీజిహ్వ ఖండించి వైతుఁ జూవె
దుండగము సేయ నిన్నిదే త్రుంచువాఁడ

హను: భువననాథుఁడు నగురాము పొలతి సీత
కటకృతి దలంచు నీకేమి? యర్వా శిక్ష.

రావ: ఓరీ! క్రోతివాఁడా! అంతరంబెఱుఁగక మాటాడకుము. నిన్నెవ్వ రంపిరి?

హను: దానవేంద్రా! వినుము.

గీ॥ అరయ జగదేక వీరుఁడై నట్టిరామ
చంద్రుబంటను. దూతనై చనుమాటన్న
వచ్చితిని. సీత నివసించు వసతిఁ దెలిసుఁ
గంటి నామె. ఫలించె నా కార్యమెల్ల.

గీ॥ శౌర్యవిక్రమశాలి యా చండకిరణ
తనయు సుగ్రీవు నెఱుగుదు దనుజనాథ!
అతని మంత్రిని శ్రీరాము నాజ్ఞ నాతఁ
డంపవచ్చితి వినుము నీ వతనిపలుకు.

దానవేంద్రా! వానరేంద్రుండగు సుగ్రీవుండు, నీతో నిట్లెఱి
గింపుమనియె.

గీ॥ చెలిమిచే నాడు నామాట చెవినిఁ జొనిపి
రామునకు సర్వలోకాభి రామునకును
సీతని మ్మట్టు లియవేని శితకలంబ
కముల రాముండు నిను లంకఁ గలుపు జలధి.

రావ: (కోపముతో) ఓరీ! వానరా! దుర్మదాంధా! కారులు పేల కుము, మానవాధమునికి బంటువాఁడుగాఁ డీ దానవేంద్రుండు, రాముఁడు గీముఁడు.

హను: రాక్షసేంద్రా! జ్వరరోగి జిహ్వకుఁ బంచదారవలెఁ బథ్యంబు లగు నానుడువులు నీచెవికిఁ జేరుగనుండనోపును. అయినను నీమేలుఁగోరి, నాతోఁచినట్లు హితంబుఁ బలుకుదు. నిశ్చల శాంతుండవై వినుము.

గీ॥ వాలినొకకోల నేలపైఁ గూలనేసి
వానరాధీశపదవికి వాసిమీర
సూర్యసుతు నిల్పె రాముఁడా శుభ్రకీర్తి
వీరవరుఁబోర నెదుర్కొంప నేరవీవు

సీ॥ మున్నీరుపల్వలంబుగ దాటఁగలిగితి
నేమహాత్మునికృప నెనసినేను
లంకిణిఁగూలిచి లంకఁజొచ్చితి నేమ
హామహుమహిమ నన్నలమియుంట
లోకసమ్మాన్య నాలోకించితిసీత ని
న్నేమహాత్మునతుసాయ మెసఁగుచుంట
నీయశోకవనంబు నేర్చిదైత్యులఁగూల్చి
కంటిని నే స్వామి కరుణఁగనుట
గీ॥ నాయనయుఁబ్రేమ కాధేయమైన నన్ను
నెదురఁజాలవు నీవింక మొదలఁగలవా?
యామహాత్ముఁడు రాముఁడే యనుజుఁగూడి
యాజి నెదురింప నెవ్వరి యండఁగోనెదో?

రావ: అరే! వానరహతక! యేమంటివి?

విభీ: అగ్రజా! పంపిన వారాడుమనినమాటలే, రాయబారి పలుకుట సహజము. సావధానచిత్తులరై, యాలకింపుడు.

రావ: చెప్పుము, చెప్పుము.

హను: సీ॥ తెచ్చినాఁడవుసీత భ్రమచ్చుతావసివోచు
నెంచినాఁడవువార లెఱుఁగరంచుఁ
దలచినాఁడవుకంధి దాట దుర్లభమంచు
నరవానరులు నీకు నెఱయుటంచు

రాము నెంచితివిగా ౹ రాజ్యహీనుండంచు
సీత నెంచితి వయో ౹ నాతియంచు
రఘువీరు వంచించి ౹ రంజిల్ల నెంచితి
మొదలంట నీసిరి ౹ మోసమగును

గీ॥ బట్టబయలయ్యె నీనీచ ౹ మందతనము
కంధినవలీలదాటితిఁ ౹ గంటి సీత
కోఁతిదిను దానవుల నాజిఁ ౹ గూల్చినాఁడ
"నొకటితా నెంచ దైవమిం ౹ కొకటిదలఁచు."

తే॥ గీ॥ మహిదయాసత్యశౌచవి ౹ రహితమైన
నీకు శివపూజలేటికి? ౹ వేదశాస్త్ర
పఠనములఁ గాల్పనొక్కొ—? "శ ౹ వంబునకును
మణివిభూషలఁ గూర్చుచు ౹ మాడ్కి—"గాదె.

గీ॥ మించిపోయిన దానికిఁ ౹ గించయేల?
సీత రామునకర్పించి ౹ చేతులెత్తి
శరణు వేడుమతఁడు నిన్నుఁ ౹ గరుణఁజూచు
నదిరుచింపమినీవంశ ౹ మంతరించు.

రావ: ఓరోరి! కష్టముష్టింపచా! ఉన్మత్తప్రలాపా బాలిశా! వానరాధమా!

ఉ॥ అంబుధిదాటనన్ని వను ౹ లాయెను నోటను నువ్వుగింజ కృ
ష్టంబున సిద్దెనుంచుకొను ౹ డాంబికమత్తత వాగెదేర? గ
ర్వంబడఁగ మదీయకర ౹ వాలున లుంఠనఁ జేతుఁ గంతమా
యంబుదమూర్తి రాముఁడుభ ౹ యాకులుఁడై ధృతిఁబాసిపోవఁగన్.

రావ: (కరవాలము ఝళిపించుచు! హనుమపై నురుకఁబోవును.)

విభీ: అడ్డమై; చెయిపట్టుకొని, అన్నా! శాంతింపుడు, శాంతింపుడు.

ఉ॥ తాలిమిఁబూనుమన్న! యిది ౹ ధర్మమె? దూతనుజంప, దూతలం
బాలన సేయు వారలను ౹ బట్టి వధింపఁగఁ జెల్లుఁగాని యీ
పాలకుఁ జేమి పల్కె—; నది ౹ పల్కెను దూతలు వధ్యులౌదురే?
వాలము గాల్చి పంపుమిఁక ౹ వచ్చినదారిని బారిపోయెడున్.

రావ: బళే! నీ యాలోచనంబు, మంచిది. కోఁతికిఁ దోఁకయే ప్రాణము. గానఁ దోఁకఁగాల్చి పంపినచోఁ దోడి కోఁతులు గేలిచేయ సిగ్గుతో సగముఁ జచ్చినట్లుండును గాన, నట్లుచేయుఁడు. దానవులారా! యీ కోఁతివాని తోఁకకు, అగ్ని రగుల్కొనం జేయుఁడు.

రాక్ష: ఓరీ! వానరా! పద పద, నీపనిపట్టెదము. రండురా! రాక్షసులారా! యీకోఁతిరోఁగము కుదుర్చెదము. (పొడుచుచు గుద్దుచు నీడ్చుకొని పోవుదురు) (అందరు నిష్క్రమింతురు)

## అ శో క వ న ము

(చెట్టుక్రింద సీత దుఃఖించుచుఁ బ్రవేశము)

సీత: రామచంద్రా! నాకష్టంబు లెన్నఁడు గట్టెక్కును? ప్రభూ! నీచరణ సేవ లభించు టెన్నఁడు? ఈ యంజనీ సుతునివలన, నాకష్టంబు లన్నియు నాలించియైన, నన్నుద్ధరింతువా?

రాక్షసస్త్రీ: (పరుగెత్తుకొనివచ్చి) జానకీ! అయ్యో! పాపము, నీతో, నింతదనుక ముచ్చటాడిపోయిన ఎఱ్ఱమొగము క్రోఁతివాని, తోఁకకుఁ జమురుగుడ్డలఁ జుట్టి నిప్పంటించి, చావఁగొట్టుచుఁ ద్రాళ్లతోఁ గట్టి యీడ్చుచు, నూరంతా, త్రిప్పుచున్నారు. ఆమంటలో వాఁడు బ్రతుకఁగలఁడా?

సీత: హా రామా! యేమి నా యభాగ్యము? ఉపకార మొనర్పవచ్చిన యీ మారుతికే విపత్తు సంభవించనేమి? సర్వభక్షకుఁడవు పవిత్రుఁడవగు, నో వీతిహోత్రుఁడా! రామకార్య రక్షణంబు నీకును గర్తవ్యంబే, నా ప్రార్థనం బాలింపుము. పవమానసుతుని రక్షింపుము.

సీత: సీ॥ త్రాహి మాం వీతిహోత్రాయ పవిత్రాయ
అగ్నిహోత్రాయ తుభ్యం నమోస్తు
పాహిమాం హేహవ్యవాహనాయా జగ
త్ప్రాణమిత్రాయ తుభ్యం నమోస్తు

అనలాయ హుత వహాయ కృపీటజన్మాయ
పరశురామాయ తుభ్యం నమోస్తు
సర్వ భక్షాయ వైశ్వానరాయ హరి
దశ్వాయ పాహి తుభ్యం నమోస్తు
తే॥ గీ॥ యజ్ఞపూరుష! యనల! తుభ్యం నమోస్తు
పాపకర్ములు దైత్యులు పట్టిగాలి
గట్టి వాలముగాల్చిరి పరమదయను
హనుమకిఁక శీతలుఁడవై యలరుమయ్యా!

గీ॥ సత్యరతుఁడైన శ్రీరామ చంద్రుఁడిపుడు
పాదసేవకురాలనై పఱగు నన్ను
కరుణఁగను నేనిఁ? బ్రోవరా గలఁడయేని?
దహన! హనుమకుఁ జల్లనై దనరుమయ్యా!

తెరలో! (పెద్దచప్పుడు, కలకలము. పౌరుల కేకలు) అమ్మయ్యో యిదేటికో ఖర్మరా! తోకగాల్చితిమని సంతసించితిమిగాని, యూరు గాల్చుచున్నది. అయ్యో! యిండ్లు, వాకిండ్లు ధనధాన్యరాసులు, బాలురు, వృద్ధులు సర్వము కాలి బూడిదలైనవి. ప్రాణాలు కాపాడుకొనుట కైన వీలు లేదు. సముద్రపు టొడ్డునకుఁ బారిపొండు. పదుడు. పదుడు. (తెరలో మంటలు)

రాక్షసస్త్రీ: అయ్యో! నా కొంప యేమాయెనో? యీదిక్కుమాలిన రక్కసులతేని మూలానగదా మాకీ యిక్కట్లుగలిగె. సీతమ్మతల్లీ! నేఁబోవుచున్నానమ్మా! బిడ్డలెంతగోల పెట్టుచున్నారో? పోవును.

సీత: ఇదేమి లంకానగరమంతయుఁ గాలిపోవుచున్నదిగాఁబోలు. హనుమానుఁడెట్లుండెనో? రామా! రామా! నాథా! రక్షించు.

(తెరలో) ఓరీ రక్కసిమూకలారా! నన్నేలఁ జుట్టుముట్టెదరు. మిమ్ము నొక్కనిం జిక్కకుండ జక్కాడెద. మీలంకానగరంబంతయు నగ్నిహోత్రునకుఁ దొలికబళం బొనర్చెద. తొలగిపొండు. బ్రదుక దలంచినచో మీ యుసురులు గాపాడుకొనుటకు సాగరు నాశ్రయిం

పుడు. మీదుర్మదాంధుఁడగు రక్కసులరేఁడు బూడిదయైన పురంబుం గాంచి, పొంగెడుఁగాక (తెరజారును) (హనుమంతుడు ప్రవేశించును)

హను: ఆహా! ఆశ్చర్యమాశ్చర్యము. వాలంబునఁ బ్రజ్వరిల్లెడు దహనుం డేలనో? శీతలుండై నాఁడు. నాకు నిసుమంతయు వేడిగల్గింపలేదు. గోపురాట్టాలక ప్రాకారసౌధంబులన్నియు భస్మంబొనర్చుచు విజృంభించు జ్వలద్దహనుండు నాయెడఁ జల్లదనంబూనుటకుఁ గతంబేమి? నాజనకునకు మిత్త్రుండగుటనో? అంతమాత్రంబునఁగాదు. ఆహా! తెలిసెఁ దెలిసె.

గీ॥ రామచంద్రుండు సత్య ౯ పరాక్రముండు
పరమసాధ్వి పతివ్రత ౯ ధరణితనయ
వారికరుణారసంబిట్లు ౯ వరలుచుంట
వీతిహోత్రుండు దానాయె ౯ శీతలుఁడుగ.

అమ్మయ్యా! శ్రీ సీతారాముల దయామహిమచే నిప్పటికి నా సాగరలంఘనము సార్థకంబైనది. సఫలీకృత మనోరథుండనైతి. శత్రునగరం బగ్నిహోత్రునికి నల్పాహారంబుగ నొనర్చితిని. శ్రీరాముని కడ కేగుటయే యిఁకఁ గావలసిన కార్యంబు (తలయెత్తి లంక వైపుఁ జూచి) అయ్యో! యెంతబుద్ధిహీనుండనైతి. విచారణంబు సేయక రామచంద్రుని కార్యంబంతయుఁ బాడుఁజేసితిని కోపాటోపంబున నొడలెఱుఁగక లంకలో జానకి యున్నదనుమాటయే, చింతింపనైతిని. కట్టా! ఆమెయు నీయగ్నిజ్వాలలంబడి, మరణించియుండనోపు. నేనింక రామునికడ కేమొగంబునం జనువాఁడ. నాశ్రమంబంతయు నిష్ఫలంబైనదిగదా! నేనీసముద్రంబునంబడి యుసురులుఁ బాసెద. (తెరలో) హనుమానునకు జయము జయము (హనుమంతుఁడు తలపైకెత్తి చూచుచు) ఎవరబ్బా! యిట్లనుచున్నారు.

(తెరలో) ఎచ్చటనైన నిట్టిచోద్యంబు కనివిని యెఱుంగుదుమా?

గీ॥ తవిలిలంకాపురము జ్వల ౯ ద్దహనుఁడేర్చి
భస్మమొనరించెనేగాని ౯ పరమసాధ్వి

సీతపై నీడగానున్న ॥ చెట్టుదరియుఁ
బోదు నీమాన నున్నది ॥ పుడమిపట్టి.

హను: ధన్యోస్మి. ధన్యోస్మి. కరుణాశరధీ! దాశరథీ! నాపై నీకు నిండు దయగలదనుట సత్యమే. జనకమిత్రా! అగ్నిహోత్రా! నాయందుఁ బుత్రవాత్సల్యంబే, నెఱపితివి. పరమపావనీ! తల్లీ! జానకీదేవీ!

నేను తెలివిమాలినవాఁడనై నీకేమో అగ్నివలన నపాయంబు వాటిల్లెనని శోకించితిని. ఇంతకంటె మూర్ఖత్వముండునా? అగ్నిహోత్రునింగూడ సంటినచో దహింపనేర్తువు, పవిత్రునిగాఁజేయ నేర్తువు, ఇట్టి నిన్ను దహనుఁడు డాయంగలఁడా? చాలు జానకి క్షేమంబు దెలిసె. ఇదె నాస్వామింగనఁబోయెద. ఇంకఁ గావలసినదేమి?

మత్తకోకిల

భూమిసస్య సమృద్ధిఁగాంచుత । భూమినాథులు నెల్లెడన్
ప్రేమ నేలవలెం బ్రజావళి । రీతి నెల్లఁ బ్రజావళిన్
క్షామడామరము ల్నశించుత । క్ష్మాసుతంబలె మానినుల్
భూమి నొప్పుచు నుండ్రుగావుతఁ । బ్రోచు నీశ్వరుఁడెల్లరన్.

శంకరాభరణము - లేక మంగళహారతి - (మాబాల గోపాలునకుపలెఁ బాడనగును)

మంగళహారతి- బంగరు చేలునకు-మంగళాకారునకు-మాల్యగిరీశునకు॥

దాసులకెందు వర-దాతయైనట్టి శ్రీని -
వాసుఁడౌ మా నృసింహ- భాసురాకారునకు ॥మం॥

శౌరికి నిగమాంత సం - చారికి దనుజేంద్రసం -
హారికి భక్తార్తి సం - హారికి సువిచారికి ॥మం॥

శ్రీరఘురామునకు - శ్రీజానకీదేవికిఁ -
గారణరూపునకుఁ- గరుణాసముద్రునకు ॥మం॥

వరమతుకుమల్లి ఘన - వంశసంజాతుఁడౌ -
నరసింహశాస్త్రికవి -వరదుఁ-డౌ హారికిజయ ॥మం॥

గీ॥ పరమపావనులును దైవ భక్తిపరులు
నైన తలిదండ్రులకు నతు లాచరించి
యీ కృతిని వారి కర్పణం బే నొనర్చి
యలరితిని బుణ్యగరిమ నా కమరు కొఱకు.

శ్రీ మాతృ పితృ దేవతార్పణమస్తు.

గద్య

ఇది శ్రీమ ద్వ్యాళశైల నృసింహ ప్రసాద సమాసాదిత సంస్కృతాంధ్ర సాహితీ
పురస్కృత సకలశాస్త్ర సంవిదుపస్కృత సరససారస్వత చతుర వాగ్ధోరణి
మతుకుమల్లి కుల మతల్లికాబ్జవల్లికా వియన్మణి కనకాద్రిశాస్త్రి
బుత్రగ్రామణి జానకీదేవీ తనూభవాగ్రణి నృసింహ విద్వన్మణి
రంగనాయకీ సతీమణీ ద్వితీయపుత్త్రి నరహర్యక్షరాయ
శాస్త్రి, అనంతలక్ష్మ్యంబికా గర్భసంభూత
నృసింహశాస్త్రి ప్రణీతంబగు
లంకాదహనంబను నాటకము
పంచమాంకము: సర్వంబు
సంపూర్ణము.

శ్రీ నృసింహస్వామినే నమః

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

మంగళమ్ మహత్.

శ్రీ మాల్య శైల నృసింహస్వామినే నమః

శ్రీ మతుకుమల్లి కనకాద్రిశాస్త్రి కవి ప్రణీతమగు

# గరుడ దండకము

## ప్రథమ మండలం

శ్లో॥ నారాయణ రథాంగాయ, భుజంగ కాలవైరిణే
నానాఛందోమయాఽంగాయ, పతంగ పతయే నమః.

జయ జయ భగవన్! గరుత్మన్! మరుత్వన్ముఖాఽమర్త్య లోకసుతౌంకార రూపాంస భాగోల్లస త్కంస విధ్వంస కాంతిచ్ఛటా ప్రావృషేణ్యాంబుదోద్య ద్ఘటాక్రాంత కూటోజ్జ్వలద్ధాటక క్షోణిభృ త్కల్పకాయాఽ ప్రమేయాఽ వ్యయక్షేమనామన్! సువర్ణోసి. సత్త్వన్! గరుత్మన్! త్రివృన్మస్తకం భవ్యగాయత్రినేత్రాన్వితం స్తోమసామాత్మకం వామదేవం దమాంతం బృహత్సామ తత్సాహ చర్య స్ఫురత్సామ యుగ్మోరు పక్ష ద్వయాలంకృతం ప్రాజ్ఞ యజ్ఞోప శబ్దాత్పరం యజ్ఞియం పుచ్ఛ మచ్ఛం వహంతం చిరం ఛందసా మంగకై రంగకై రైచ్ఛిరైః, ప్రజ్వలంతం యజుర్నామకం వేద మూర్త్యా చిరంతం నిరంతం భవంతం సదాఽహం తమీడే.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

## ద్వితీయ మండలం

మధుమథనరథిన్ మహాపక్ష రక్షచ్ఛటాకేళికా ఘోరదంభోళి ధారా కఠోరాహతవ్రాత భస్మావలీకార దక్షాత్మపక్షాగ్రరోమాభి రామప్రభావం త్వదీయానుభావం హి కో వర్ణితుం శక్నుయాదాప్నుయా దిష్టసిద్ధిం త్వదీయస్త వాత్తత్సమస్తోపిలోకః ప్రకామం ప్రకాశోద్య దాకాశరత్న ప్రతీకాశ వక్త్రప్రభాక్షిప్త పూర్ణక్షపేశక్షపాశు స్వపక్షోద్ధృతోద్భూత వాతూల జాతేన తూలం మమాఖిల మేనః

ప్రభూతం మహావీర్య పక్షీశ! మాం రక్ష రక్షాక్షతోక్షిప్త ముగ్రక్షుర
ప్రగ్రదీప్త ప్రచండాగ్రతుండేన వైతండికం ఖండ యాస్మ ద్ద్విష
న్మండలం.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

## తృతీయ మండలం

గరుడనిఖిల తక్షకానంత కర్కోటకాద్యుద్భటాహీశ్వరవ్యూహ
వంశాటవీదాహదావానలాత్మప్రతాపజ్వల జ్వాలికాజాల సంసేవ్య
మానాంఘ్రిరాజ స్సనఖాగ్రైర్నవైర్వాలఖిల్యై స్స వైఖానసై స్సర్వ
వాచంయమై స్తూయమాన స్స్వమంత్రా ఽమృతాసారతో ఽవృశ్చికవ్యాళ
సాలా వృకాదీంశ్చ రాత్రించ రాహశ్చగాంధశ్చర త్సాన్మచరద్యోచర
కూర్రనానావిషప్రాణి దంష్ట్రాగ్ర జిహ్వాగ్ర నాసాగ్రహస్తాగ్రపాదాగ్ర
రోమాగ్ర పుచ్ఛాగ్ర జాగ్రత్కరాళీభవత్కాల కూటప్రభృత్యుగ్ర
హాలాహలాభీల కోలాహలానూన దోదూయమానాత్మ దీనాననం
పాహి సద్యస్స్వధాస్వాహ ఏవా ప్రదీప్తం హుతాశం జహోన్నిద్ర
రుద్రాంసు కీర్త్యాహ్వయాభ్యాం ముఖాభ్యాం పరిష్వజ్యమానం ప్రస
న్నార్తిహారిన్ ! లసన్నాగహారి! నమస్తే నమస్తే నమస్తే నమః.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్లో॥ ఖండేషు త్రిషు గూఢం
మండిత త్రిపద మంత్రం ప్రత్యేకం
చండాళీవిమతండా
దండజపతిదండ కోయ మవ్యా న్నః॥

ఓమ్ తత్సత్.

ఈ గరుడదండక రచయిత హనుమద్విజయ గ్రంథకర్తకుఁ
బ్రపితామహుఁడు.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



శ్రీ నరసింహ సహాయము

శ్రీ గరుడదండక రచయితయగు

మతుకుమల్లి కనకాద్రిశాస్త్రిగారి యను జన్మమగు
మతుకుమల్లి మాధవశాస్త్రి గారిచే రచియింపబడిన
దశావతార స్తోత్రములోని పద్యములు
ఇందుదహరించెద

కం. శ్రీరమణీ వక్షోజ త
టీరంజిత ఘుసృణ రసపటీరాంచిత వి
స్తారోరస్స్థిత కౌస్తుభ
హార లతాభరణ! మాలి కాచలరమణా! 1

మ. భవదంచత్కరుణా కటాక్ష కలితోపస్కార సంప్రాప్త మ
త్కవితా భారతి బంధురార్థ ఘటనా గంభీర భావాఢ్య నవ
ద్య విధిం జొప్పడకున్న నీదుమది కాహ్లాదంబు గావింపదే?
భువి దానేర్పు శుకోక్తి చందమున సొంపుంబెంపు దీపింపగన్. 2

శా. భావి శ్రీరఘురామతం జల నిధిన్ బంధించెదం గానముం
దేవే వేగ నతోన్నత స్థలములం దీక్షించి వచ్చోకముం
గావింపం జను నంచు వాల హతులం గ్రావాళి నుగ్గాడుచున్
తీవిం గ్రీడ దనర్చు నక్కపటుపాఠీనంబు మమ్మేలుతన్. 3

శా. అంభోరాశిని మంథనోద్ధ సురదైత్యక్ష్వేళి తాడంబరో
జ్జృంభద్ధ్వానభిదా విశీర్య దురు రాజీవోద్భవాండోద్యత
స్తంభస్కంద మహీధ్రమూల ఫలకాంచ త్పృష్ఠ సాధిష్ఠ సం
రంభారంభణశాలియాకమఠ రాడ్బ్రహ్మంబు జింతించెదన్. 4

మ. కనకక్షోణి ధరంబు కర్ణిక కులగ్రావేంద్రముల్ తేంట్లునై
తన దంష్ట్రాబిసవల్లరిం బొదలు గోత్రామండలాంభోరుహం
బనువౌతావుల నుల్లసిల్లగ సముద్యద్విక్రమ శ్రీ విక
ర్తన దీప్తిం వికసింపజేయు కిటిరాడ్బ్రహ్మంబు జింతించెదన్. 5

మ. పెనుగంబంబున నుండి కట్టెదుట బల్భీరంబున న్నిల్చుదై
త్యుని మేన న్మృగరాల కత్తళములో నొప్పారు నాత్మాకృతిం
గని యన్యద్విరదారిశంక నొకొకి న్కుం బైకి లంఘించి తీ
వ్ర నఖాగ్రంబుల వ్రచ్చినట్టి నృహరి బ్రహ్మంబు జింతించెదన్. 6

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

ఈ దశావతార స్తోత్రము రెండు వందల పద్యములు గల గ్రంథము. అముద్రితము.

మృదుమధుర కవయిత్రీ శిరోమణి,
గుడిపూడి ఇందుమతీ దేవి.

